# సమాలోచన



జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక

సంపాదకుడు: విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి.

సంపుటము 2 — రాజమహేంద్రవరము 1-4-1979 — సంచిక 11

## —* ఈ సంచికలో *—



16—4—79 సంచికలో సమాజ నిర్మాణంలో రచయితల పాత్ర, కవికొండలవారి ప్రకృతి గీతములు, ప్రసన్న కుసుమాయుధం - తత్త్వదర్శనం మొదలగునవి ఉంటాయి.

—* 1, 16 తేదీలలో ప్రచురింపబడును *—

చందా
సంవత్సరమునకు రు 10-00.
అర్ధసంవత్సరమునకు రు 5-50.

విడిప్రతి 50 పై.

# కొన్ని ప్రయోగాలు - ఒక వివరణ

— శ్రీ ఎల్. కె. మల్లేశ్వరరావు.



భారతదేశంలో ప్రధానపాత్ర వహించిన భాషాకుటుంబాలు రెండు. వాటిలో మొదటిది హింద్వార్య భాషాకుటుంబం. రెండోది ద్రావిడభాషా కుటుంబం. దాదాపుగా నవీనోత్తరాహిక భాషలన్నీ మొదటి భాషాకుటుంబానికీ; దక్షిణ భారతదేశంలో వ్యవహరింప బడుతున్న తెలుగు, తమిళం, కన్నడ, మలయాళం మొదలైన భాషలూ; ఉత్తరభారతదేశంలో వ్యవహృతమౌతున్న బ్రాహుఈ మొదలైన భాషలూ కలిపి మొత్తం 23 భాషలు ద్రావిడ భాషాకుటుంబానికీ చెందినవి.

హింద్వార్య భాషాకుటుంబానికి చెందిన సంస్కృతప్రాకృతాల ప్రభావం భారతీయ భాషలన్నిటిమీదా ఉంది. ఒక భాషమీద జ్ఞాతి భాషాప్రభావం గాని, పరభాషా ప్రభావం గాని పడటానికి భౌగోళిక సామీప్యం, రాజకీయం, మతం, వాణిజ్యం మొదలైన సంబంధాలు దోహదంచేస్తాయి. చూ. తెలుగులో అన్యదేశ్యాలు _ అవతరణ కారణాలు 'తెలుగు' జూలై-సెప్టెంబరు, 1977.

మొట్టమొదట తెలుగుభాషపై సంస్కృత ప్రాకృతాల ప్రభావం అత్యధికంగా పడింది. ఆతర్వాత ఉర్దూ, మరాఠీ, ఒరియా, హిందీ మొదలైన ఆధునిక ఉత్తరభారతీయ భాషలు, సజాతీయ భాషలైన తమిళ కన్నడ భాషలేకాక పోర్చుగీసు, ఫ్రెంచి, ఇంగ్లీషు మొదలైన యూరపుఖండ భాషలు కూడా తమ ప్రభావాన్ని ప్రసరింప జేశాయి.

నాగరిక ప్రపంచంలోని ఏభాషా కూడా ఇతరభాషా ప్రభావం పడకుండా లేదు. కాబట్టి ఒక భాషా పదానికి వ్యుత్పత్తిని నిర్ణయించేటప్పుడు ఆ పదం దేశ్యమా? జ్ఞాతిభాషాపదమా? అన్యదేశ్యమా? అని వివేచించి ఆ భాషతో సంబంధమున్న భాషాపదాలతో తులనాత్మకంగా పోల్చిచూచి పదవ్యుత్పత్తిని నిర్ణయించాలి.

బాలప్రౌఢ వ్యాకరణాల్లో వివరింప బడిన భాష భారతాది కావ్యాలకు పరిమితమైన భాష కాబట్టి ఆ తర్వాత వచ్చిన కొన్ని ప్రయోగాలు బాలప్రౌఢ వ్యాకరణాల పరిధిలోనికి రావు. జీవద్భాష పరిణామశీలి కనుక భాషాపరిణామాల్ని అనుసరించి వ్యాకరణాన్ని ఎప్పటికప్పుడు పునర్నిర్మించుకోవాలి. కొన్ని ప్రయోగాలను తెలిసినంతలో వివరించడానికి జరిగిన ప్రయత్నమే ఈవ్యాసం.

బాబాయి  ఇది ఉచ్చారణలో 'బాబాయ్' గా ఉంటుంది. ఇది ఉర్దూలోని 'బాబా' అన్న పదానికి తెలుగులోని 'ఆయి' అనే ప్రత్యయం చేరడంవల్ల ఏర్పడింది.

ఉ॥ బాబా తండ్రి, పినతండ్రి.

ఆయి: ఆదరద్యోతకమైన ప్రత్యయం. వ్యుత్పత్తికి తొత్తాయి చూడండి. తెలుగు తప్ప అన్ని ద్రావిడభాషల్లో ఇది స్త్రీ వాచకమే.

ఉ॥ అమ్మాయి, పిన్నాయి.

ఉ. బాబా _ ఆయి బాబాయి పినతండ్రి అబ్బాయి, బాబాయి మొ॥ శబ్దాల్లోని_ఆయి పిన్నాయి, అమ్మాయి మొదలైన శబ్దాలసామ్యంవల్ల చేరి ఉండవచ్చు.

బాబయ్య. ఇది హిందీలోని 'బాప్' జన్యమైన 'బాబు' అన్నపదానికి 'ఆర్య' శబ్దభవమైన 'అయ్య' అనే పూజ్యతావాచకం చేరడంవల్ల ఏర్పడింది బాబు హిం. బాప్ అయ్య ప్రా. అయ్య సం. ఆర్య బాబయ్య.

ఇలాగే, అన్న, తాత, మామ మొదలైన పదాలకు కూడా 'అయ్య' చేరి అన్నయ్య, తాతయ్య, మామయ్య ఏర్పడతాయి. వీటి సామ్యం వల్ల అక్క_స్త్రీ వాచకమైనా అయ్యచేరి అక్క+అయ్య=అక్క_య్య అవుతుంది.

బద్మాష్  ఉర్దూద్వారా తెలుగులో ప్రవేశించిన అరబ్బీ భాషాపదం. అర. పార. ఉర్దూ బదమ్ఆశ్ నీచుడు, దురాచారుడు, దొంగ, దుష్టుడు, నీచకార్యాలద్వారా జీవించేవాడు.

బద్మాషు బద్మాష్ ఉ. బదమ్ఆశ్.

దీనిమీద సంస్కృతప్రభావం ఏమాత్రం లేదు. ప్రాకృతాల ప్రభావం అసలే లేదు. ఇది బద్దు+మాసి నుంచి ఏర్పడింది కాదు.

కేడుగాలమ్  ఇది తమిళభాషలోని మిశ్రసమాసం. త. కేటు+సం. కాలమ్ చెడుకాలం.

ఇది తెలుగు సమాసం కాదు. ఇది భౌగోళిక సంబంధంవల్ల దక్షిణాంధ్ర సరిహద్దు ప్రాంతంలోని తమిళులు ఉపయోగించే మాట. తమిళంలో లాగే ఇదికూడా తెలుగులో ఉపయుక్తమౌతోంది. దీనికి బాలవ్యాకరణానికి సంబంధం పొసగదు.

తొత్తాయి. ఇది 'తొత్తు'కు ఇంతకు ముందు చెప్పిన 'ఆయి' అన్న ప్రత్యయం చేర్పగా ఏర్పడిన రూపం. ఇది అర్థవిపరిణామం పొందినపదం.

తొత్తు వి.

1. వేశ్య, వ్యభిచారిణి  భాగ. 6.60
2. దాసి, బానిస  కాశీ. 2.49

త. తొట్టి పనికత్తె, సేవకురాలు ఆడబానిస. తొట్టుత్తె ఆడబానిస, నీతిబాహ్య. తొటుంపి ఆడబానిస

తొత్తు బానిస. పరాధీన;

క. తుటిల్ పని, సేవ, బానిసతనం

తు. తొత్తు సేవకురాలు-Ded 290

పైచర్చలో తొత్తు + ఆయి = తొత్తాయి అయిందని నిస్సంశయంగా చెప్పొచ్చు.

ఇక ఆయి సంగతి చూద్దాం.

క. అయ్, అయ, ఆయి తల్లి;

తు. ఆయ;

త. ఆయ్, ఆయాళ్, ఆయి, యాయ్ తల్లి

మ. తాయి,

గోం. యాయి;

కొండ. ఆయ,

కుఇ. అజ, ఇజ, ఇజ, ఇ X ..., ఐఅ,

ఐఅని తల్లి (స్త్రీ).

పర్జి. అయల్ (స్త్రీ), భార్య, ఇయ తల్లి

కొలా. అయ్, నా, అయ్న

ఒల్లా. ఆయ, ఆయల్ (స్త్రీ), భార్య,

కురు. అయంగ్, ఆయో తల్లి,

యో. ఫలానివాని తల్లి,

మాల్తో. అయ్య నా తల్లి;

బ్రా. అఈ తల్లి, సోదరి, కుమార్తె,

పూజ్యస్త్రీ సంబోధన

మూ. ద్రా *ఆయ్ - Ded 308

పై వివరణవల్ల తొత్తు ఆయి తొత్తాయి అయిదనడంలో విప్రతిపత్తిలేదు.

గోంగూర : గోను + కూర

గోన్ + కూర = గోంగ్గూర = గోంకూర అయిందనీ, గోగు + ఆకు గోంగాకు అనీ గ్రహించడమే సముచితం. గోంగూర మొక్క సామ్యంవల్ల 'గోగాకు' బహుశః గోంగాకు ఉచ్చరించబడుతూ ఉండవచ్చు.

'విబుధజనులవలన విన్నంత కన్నంత తెలియవచ్చినంత తేటపరచడానికి జరగిన ప్రయత్నం ఇది.

సంకేతాలు - వివరణ

సం. సంస్కృతం

ప్రా. ప్రాకృతం

క. కన్నడం

తు. తుళు

మ. మలయాళం

గోం. గోండి

కొలా. కొలామి

ఒల్లా. ఒల్లారి.

కురు. కురుఖ్.

బ్రా. బ్రాహుఈ

మూ. ద్రా. మూలద్రావిడం.

* ఊహాసిద్ధ రూపం

I.A.E.d. Indo aryan Etymological Dictionary

D.E.D. Dravidian Etymological Dibtionary

తె.వ్యు.కో. తెలుగువ్యుత్పత్తికోశం.

—...—

# ఆంధ్రమున ఆంగ్లపరిణామము

— శ్రీ శిరీష.

భాషింప బడునది భాష, మనభాష తెలుగుభాష. ప్రపంచములో అనేక భాషలు ఉన్నవి. ఈభాషలు అనేక ప్రభావములచే, అనేక కారణములచే అనేక పరిణామములను పొందుచు, ఒక నిర్దిష్ట రూపమును సంతరించుకొనుచున్నవి. మన తెలుగుభాషపై నన్నయ కాలమునుండి నేటివఱకు సంస్కృత, ద్రావిడ, పార్సీ మొ॥ భాషలయొక్కయు, సరిహద్దు రాష్ట్ర భాషలైన ఒరియా తమిళ కన్నడ మళయాళాదుల యొక్కయు ప్రభావము నిసర్గము - ఆంధ్రభాషలో ఆంగ్లభాషాస్థానము నేడుగణనీయమైనది. ఆంగ్లపదములు ఆంధ్రములో పొందినమార్పులను, కలసిన తీరును పరామర్శింతును.

కార్ల్‌మార్క్స్ చారిత్రక భౌతిక సిద్ధాంతము ననుసరించి సమాజములో ఆర్థిక. ఉత్పత్తి సంబంధములనుబట్టి సమాజము మారుతుంది. ఆర్థిక - ఉత్పత్తి సాధనములు ఎవరి అధీనములో ఉంటే వారి అభిరుచికీ అవసరములకూ అనుగుణముగా సమాజములోని శాస్త్ర, తత్త్వ, ధర్మాదులు, కళలు, భావోద్రేకములు అన్నీ మారుతాయి. — (ఈసూత్రము ననుసరించి) రెండు శతాబ్దములు మనదేశమును పరిపాలించిన ఆంగ్లేయుల ఆచార భాషావ్యవహారముల ప్రభావము మొత్తము హిందూదేశముపై అనన్యసామాన్యముగ ప్రసరించుట గమనార్హము.

పాలకభాష (రాజభాష) పాలితభాష (పరిపాలింపబడువారి భాషను) ప్రభావితము చేయును. వర్తక వాణిజ్య వ్యవహారాదులన్నియు రాజభాషలో జరుగుటచే పాలకభాష పాలితభాషపై ప్రభుత్వము చేయుట అతిసహజము. ఇట్లే ఆంధ్రభాషపై కూడ రెండు శతాబ్దములు మనలను పరిపాలించిన ఆంగ్లేయుల భాష అధికారము చేసినది. ఈ ఇంగ్లీషుభాష తెనుగుభాషలో ఏవిధముగ తనరూపురేఖలను సంతరించుకొన్నదో గమనింతము.

భాష ధ్వనిసంకేత నాదస్వరూపిణి. అట్టి ధ్వనులకు కొన్ని గుర్తులనుంచి ఆయా భాషలకు ఆయాలిపుల నేర్పరచిరి. సంస్కృతమునుండి 19 ధ్వనిసంకేతములు చేరి తెనుగు అక్షరములు 37, మొత్తము ఏబదియారు (56) అయినవి. నేడు ఆంగ్లప్రభావముచే కొన్ని క్రొత్త ధ్వనులు చేరినవి.

ఉదా॥ :-- "కాఫీ, ఫ్రెండు, ఫ్లాస్కు" మొ॥ న పదములందు 'ఫ' కారము 'F' వలె ధ్వనించును, ఈ 'ఫ' కారము నేటి వ్యావహారిక భాషలో అతిచిత్రముగ అధికారము చెలాయించుచున్నది. 'ఫ' కారస్థానమున పై 'F' 'ఫ' కారమే ఉచ్చారణలో ఉన్నది. ఉదా॥ ఫలము, ఫక్కున నవ్వి ఇట్టి 'ఫ' కార సూచితధ్వని సంకేతము (ఉదా॥ ఫోజులు కొట్టుట) ఆంధ్రవర్ణమాలలో లేదు.

ఆంధ్రోచ్చారణకూడ ఆంగ్లపదముల పలుకుబడులను మార్చినది. ఆంగ్లపద

ములు తెలుగునాట కొంత విలక్షణ రూపములను పొందినవి. సాధారణముగా ఇంగ్లీషులో 'ఆర్' (r) 'సైలెంట్'గా' అంటే కొంత ఊనిక తక్కువగా ఉచ్చరించబడును. అట్లే ఇంగ్లీష్ మాటలలో మొదటి అక్షరములపై ఉన్న పూనిక తర్వాతి అక్షరములలో కొన్నిటిపై ఉండదు. తెనుగున ఇట్టి విభేదములేదు; స్పష్టత ఎక్కువ. అందుచేత తెలుగులోకి పరివర్తితములైన ఇంగ్లీషుమాటలకు కూడ స్పష్టోచ్చారణ వచ్చినది. ఉదా॥ - గవర్నరు, జర్నలిస్టు, పేపరు, యూనివర్సిటీ 'తాటాకు' లోని 'టా' పుచ్చారణను సూచించే వర్ణము తెలుగులో లేదు. ఇట్టి విలక్షణమైన కంఠ్యములైన 'ఆ' 'ఆ' వర్ణోచ్చారణ ఇంగ్లీషుమాటల ప్రవేశమువలన తెలుగులో ఎక్కువగా చోటు చేసుకున్నది.

ఉదా॥ పాంటు, కారటు, మారేజి, బాలేజి.

యోగ్యత, ఆకాంక్ష, ఆసత్తిగల పదముల సముదాయమే వాక్యము. అనేక భావసముదాయ పుష్పరాశులే సాహిత్య స్వరూపము.

భావప్రకటనమే భాషలక్ష్యం. ఒక భాషలో ఇతర భాషాపదములు వచ్చి చేరుటకు రెండుకారణములు కలవు.

1) కొన్ని భావముల ప్రకటనకు వలయు పదములు భాషలో లోపించినపుడు ఆ భాష ఆయాపదములను ఎరవు తెచ్చుకొనును.

2) సౌందర్య వ్యాపారకములని తోచినపుడు, అన్యభాషాపదములపట్ల ఆకర్షితులు అయి, వానిపై మక్కువతో వానిని మాతృభాషలోనిక అనురూపములుగగాని యథాతథముగగాని వాడుట జరుగును.

ఆధునిక యుగ ప్రభావము చేతను, పారిశ్రామికీకరణము వలనను, అనేక ఆధునిక పరిశోధనలు పాశ్చాత్య జన్యములగుటచేతను, అనేక పదముల నాంగ్లము నుండి తెచ్చుకొనవలసివచ్చినది. పాశ్చాత్య భావోద్భవములగుటచే అసంఖ్యాక భావములు మన భాషలోనికి 'ఆగమములు' గనేకాక, ఆదేశములుగను స్థానము నార్జించుకొన్నవి.

పరిశోధనలు, విద్యా ప్రణాళికలు, అనేక అంతర్జాతీయ, రాజకీయ, సాంఘిక పరిణామములవలన మన భాషలో ఏతదనేక వినూత్న భావ ప్రకటనార్థమై అనేక ఆంగ్లపదములు వచ్చిచేరినవి. అట్టి పదములకు ఆంధ్రీకరణముచేయ యత్నించిరి. కాని అది అస్వాభావికమై ఇచట అతకలేదు. అందుచే అట్టి పదములు క్రమముగ మంచువలె కరగిపోయినవి.

ఉదా॥ రైలు, కాంటీనులు, హోటలు ఇత్యాదులకు 'ధూమశకటము, ఫలహార శాల, భోజనఫలహారశాల మొ॥వి వ్యావహారికమునకు మరుగుననే వుండిపోయినవి. ఇందులకు కారణము భావ ప్రకటనసామర్థ్యలోపమేకాక, భాషావ్యావహారిక సౌలభ్యము కూడ హేతువే! ఆంధ్రీకరణమున ఒకటి, రెండు ఇంగ్లీషు అక్షరములకు మారుగా చాల అక్షరములను వేయవలసివచ్చినది. ఈ కారణముచేతనే ఆంగ్ల పదముల ఆంధ్రీకరణములేకాక, కొన్ని తెనుగుపదములే భాషనుండి జారిపోవుచున్నవి.

ఉదా॥ వేగముగా, క్షమించండి, పాఠశాల, కళాశాల. వీనికిఇంగ్లీషుమాటలే వాడుకలో వున్నవి. ఇంగ్లీషే నేటిశిష్ట వ్యావహారికములో ఎక్కువగా నున్నది. ఇవి ఎంతగా నాటుకొని పోయినవంటే తల్లులను 'తెలుగుమాటలు'టని అడిగితే తడుముకొనవలసివస్తున్నది.

ఉదా॥ సారీ, స్పీడుగా, స్కూలు, కాలేజి, సడన్‌గా, షాపు (అంగడి), మార్కెట్టు (విపణివీథి). లేటుగా, బిల్డింగు. పాశ్చాత్య సంప్రదాయ సంపర్కముచే కొన్ని క్రొత్తపదములు. భావ ప్రకటన సామర్థ్యలోప నివారణను చేయుచున్నవి.

ఉదా॥ టాటా, కంగ్రాచ్యులేషన్స్ (వీడ్కోలు, అభినందనలు)

ఈరీతిగ దిగుమతి చేయబడిన ఆంగ్ల భాషాసామగ్రి తెలుగులో క్షీరనీరన్యాయమున ఎట్లు కలిసిపోయినదో పరిశీలింతము.

అజంత, ఉకారాంతములు తెలుగు భాషకు తెనుగుదనపు సొంపును చేకూర్చినవి. సంస్కృతాది ఇతరభాషలనుండి కొని తెచ్చుకొనిన పదములు అజంతములు, ఎక్కువగా ఉకారాంతములను సింగారించుకొన్నవి. అజంతములు ఆంధ్రమునందలి ఆంగ్లపదములలో కొన్నిపట్టుల ప్రత్యేక సన్నివేశములందు ద్విత్వములుగను అయినవి.

ఉదా॥ పాకెట్టు, రాకెట్టు,

కొన్ని పదములకు ఉత్వము అంతమున చేరి యథాతథముగ ఆంధ్రమున అవతరించినవి. ఉదా॥ బ్రేకు, కారు.

ఆంగ్ల పదాంత సంయుక్తములెక్కువ మార్పులు పొందకుండ, 'ప్రకృతి రూపములే' నిలిచినవి.

ఉదా॥ డెస్కు, ఫ్లాస్కు.

ఈవిధముగా ఆయాఅక్షరము లాయారీతులుగా తెలుగున మారినవి.

కంఠ్యములగు 'కవర్ణ', 'గవర్ణ'ములు ద్విత్వములైనవి.

ఉదా॥ ట్రిక్కు, మెట్రిక్కు, లక్కు, చెక్కు, బుక్కు. డిక్కీ, విగ్గు, జగు.

పూర్ణబిందు పూర్వక 'క' వర్ణ, 'గ' వర్ణ

ములకు మాత్రము ద్విత్వము రాలేదు. 'ఉత్వ' మాత్ర పరిణామము నొందినవి.

ఉదా॥ ఇంకు, లింకు, జింకు, పళ్ఫేటు,

తాలవ్య, దంత్య చకార, జకారములు మాత్రము ఈ పదార్ణవములో ప్రత్యేక రూపములు.

ఇవి అన్ని చోట్ల 'ఇ' త్వమును పొందినవి.

ఉదా॥ లంచి, బెంచి, ఫ్రెంచి, రెంచి, ప్రెస్టేజి, లగేజి, కాలేజి, ఆరంజి, 'బెంజి కంపెనీ.'

మూర్ధన్య 'ట'కార, 'డ'కారములు ద్విత్వములుగ మారినవి. (సంస్కృత రుక్, రాట్, మరుత్ శబ్దములు ప్రథమైక వచనాంతములే యయి, ఉత్వద్విత్వములు పొందిన సందర్భము నిట జ్ఞప్తికి తెచ్చుకొన దగును.)

ఉదా॥ ప్యాకెట్టు, క్రికెట్టు, రాకెట్టు విట్టు, బ్రాకెట్టు, బ్రెడ్డు, రోడ్డు, బకెట్టు.

దీర్ఘపూర్వక 'ట', 'డ' లకు ఉత్వము మాత్రమే వచ్చినది; ద్విత్వము రాలేదు.

ఉదా॥ గైడు, స్పీడు, సీటు, పేపరు షీటు, ప్లేటు, రేటు, గేటు.

ఇట్లే బిందుపూర్వక టకార, డకారములు ఉత్వమును మాత్రము పొందినవి.'

ఉదా॥ కరెంటు, కాన్వెంటు, పెయింటు, సిమెంటు, సైలెంటు, పార్లమెంటు, వారంటు, రౌండు. సౌండు అంత్యసంయుక్తములు మాత్రము అన్ని సందర్భములలోను ఉత్వమాత్ర యథాతథ రూపములను పొందినవి.

ఉదా॥ వేస్టు, గెస్టు, లిస్టు, పోస్టు కార్డు, గార్డు, రికార్డు, వరల్డు, వార్డు, బోర్డు.

దంత్యములు ఆంగ్లపదాంత 'న' వర్ణము ద్విత్వమైనది.

ఉదా॥ పెన్ను, టన్ను, పిన్ను

దీర్ఘపూర్వక 'న' వర్ణము ద్విత్వరహితముగనే యున్నది.

ఉదా॥ ఫోను, ఏరోప్లేను, స్పూను, కార్టూను, క్రేను, పోను,

రెండుకంటె ఎక్కువ అక్షరములున్న పదాంత 'న' వర్ణముకూడ ప్రకృతిరూపమునే పొందినది.

ఉదా॥ స్టేషను, రేషను, ఫ్యాషను.

'ల' వర్ణము :- దీర్ఘపూర్వక 'ల' వర్ణము, రెండక్షరములకన్న ఎక్కువ ఉన్న పదాంత్య 'ల' కారములు 'న' వర్ణ 'ము' వలెనే 'ఉ' త్వమును మాత్రము పొందినవి.

ఉదా॥ స్కూలు, రైలు, స్కేలు, టేబిలు, లేబిలు, హోటలు.

'ఇ' కార'ఏకార పూర్వక 'ల'కారము ద్విత్వమును పొందినది.

ఉదా॥ బిల్లు, బెల్లు, డ్రిల్లు.

మూర్ధన్య 'ష' కార _ దంత్య 'స' కారములకు ద్విత్వము కనపడుచున్నది.

ఉదా॥ బ్రష్షు, బస్సు, ఫెస్సు, డ్రస్సు

మూడక్షరముల పదాంత్య 'ష'కారము ఉత్వమును మాత్రము పొందినది

ఉదా॥ ఇంగ్లీషు, వార్నీషు.

తత్సమ 'స్త్రీ, శ్రీ, ధీ, గో, రో,

ఇత్యాది ఏకాక్షర శబ్దములకు దీర్ఘము తొలగలేదు. ఇదేనియమము ఆంగ్ల దీర్ఘాంత పదములకు వర్తించినది.

ఆంగ్లదీర్ఘాంతపదములును నిట్లే యథాతథముగా నిలిచినవి

ఉదా॥ ట్రై, ఫ్రీగా యుండుట.

ఉదా॥ మైకా, వరండా, సిటీ, కంట్రీ లారీ, సారీ, శారి (sari), స్టోరీ, ఫ్యాక్టరీ, డాడీ, మమ్మీ, సినిమా, హిప్పీ, సిల్లీ.

ఈ రీతిగ అసంఖ్యాక ఆంగ్లపదములు ఆంధ్రభాషలో స్థిరము నార్జించినవి

భాషలోని మాటలు నాణెములవంటివి. ప్రాచీన కాలమున వరహాలు, దీనారటంకాలు, అణాలు, బేడలు, అశోకుడు, హర్షుడు, జార్జి, విక్టోరియా మొదలైన రాజుల బొమ్మలుగల నాణెములు ఆయాకాలములలో చెలామణి అయినవి. నేడు రూపాయి మొదలైన ద్రవ్యము (కరెన్సీ) వాటికి బదులు చెలామణి అగుచున్నది. నాటి నాణెములు నేడు వినిమయము జరుగవు అట్లే భాషలోని పదములు, సామెతలు, కవితాలంకార రీతులు కూడ వాటిఅక్కర తీరగనే మరుగున పడిపోవును. సరికొత్త పదములు 'ఆటోమేటిగ్గా' ఆ స్థానమును భర్తీ చేయును. అవసరమైన పదములు అదనముగా వచ్చిచేరును. ఇట్లు భర్తీ చేయు మాటలేకాక, భావపరిపూర్తికి దోహదము చేయు నూతనాగమపదములు కూడ భాషకు పరిపూర్ణతను, నిండుదనమును తెచ్చును. నేడు ఆంగ్లభాష ఆంధ్రభాషలో అట్టి విశిష్టస్థానమును నిండుగా అలంకరించినది.

---

# నవలా సాహిత్యము - లత

## ( 1947 — 1977 )

- శ్రీమతి పుర్ణపాటి రాజేశ్వరి, ఎం. ఏ.

తెనుఁగు నవలా ప్రపంచమున శ్రీమతి లత దొక విశిష్టస్థానము. విశ్వనాథ, గుడిపాటి వంటి శిష్టవైదికము ప్రబల సుఖ వాదముల నడుమ సంప్రదాయమునకు పూర్తిగా దూరము కాక, తనదైన సిద్ధాంతములను ప్రవచించుచు ప్రేమానుభూతులకు విలువ నిచ్చి నేటి సమాజమునగల లోపములను నిర్ద్వంద్వముగా నెత్తి చూపుచు లత తన రచనమును సాగించినది. భాష, శిల్పము, కథా సంవిధానము, మానవతా దృక్పథము, తాత్త్విక జిజ్ఞాస ఇత్యాదులన్ని కళల నామె కళాప్రపూర్ణయే.

స్థూలముగా నీమె రచనలు ద్వివిధములు. వ్యక్తి ప్రధానమైన మానసోన్మీలనమునకు చెందినట్టివి కొన్ని, సామాజిక చిత్రణములైనవి మఱికొన్ని. అందు మోహనవంశి, పౌలస్త్యుని ప్రేమకథ, ఉమర్ ఖయాం, శ్రీచరణాలు వంటివి మొదటి కోవకు చెందినవి. దీపకళిక, ఎడారిపువ్వులు. నీలినీడలు, జీవనస్రవంతి, మిగిలిందేమిటి, రాగజలధి, వనకెన్నెర, వారిజ, చరిత్ర శేషులు, పిచ్చివాళ్ళ స్వర్గం, తిరగబడిన దేవతలు, భగవంతుని పంచాయితీ, ప్రేమరాహిత్యంలో స్త్రీ, ఆదిమధ్యాంతాలలో, కాలం కఱచిన కడపట, నీహారిక, రక్తపంకం, మహాయాత్ర, పథవిహీన, సప్తస్వరాలు, దెయ్యాలు లేవు, గాలిపడగలూ నీటిబుడగలూ, ఇగ తులసివనం, మహానగరంలో స్త్రీ, నరకానికి నిచ్చెనలు, జరుగుతున్న కథ, ఈకథ ఇంతే, సుడిగాలి, మాతాహారి, విధి, మిస్ మోహిని, అగ్నిగుండం, గంగపుట్టినగడ్డ, అనామిక, వెన్నెల మరకలు, బ్రాహ్మణపిల్ల వంటివి రెండవ కోవకు చెందినవి.

ఆమె రచనలలో కాన్పించెడి సంప్రదాయ సిద్ధాంతములు, ప్రేమ తత్త్వము, సమాజ చిత్రణ, మనస్తత్వ చిత్రణ, నవలా శిల్పము, మున్నగు విషయము లిట స్థూలముగా సమీక్షింపబడును.

సంప్రదాయ సిద్ధాంతములు.

వివాహవ్యవస్థ పట్ల లతకు గల గౌరవము నీలినీడలు, కాలం కఱచిన కడపట, వారిజ, నరకానికి నిచ్చెనలు, నీహారిక, వనకెన్నెర, దీపకళిక, మిస్ మోహిని, భగవంతుని పంచాయితీ నవలలు వ్యక్తపఱచుచున్నవి.

స్త్రీకి సమాజమునకు ఆధారభూతమైనది వివాహమని "నీలినీడలు" "కాలం కఱచిన కడపట" నవలలు చెప్పుచుండగా; స్త్రీలు పాతివ్రత్యధర్మము తప్పి చరించినచో అనేక కష్టనష్టములకు గురి అగుదురని వారిజ, నరకానికి నిచ్చెనలు, నీహారిక, వనకెన్నెర, నవలలు సందేశ మిచ్చుచున్నవి.

వారిజ తల్లి ఆంధ్రబ్రాహ్మణయువతి. సదాచార సంపన్నుఁడగు భర్తను వదలి పరపురుషాకర్షణకు లోనై ఇల్లు వీడినది. వెంట వచ్చినవాడు త్వరలోనే అంతర్ధానమైనాడు. అస్సాం టీ తోటలలో కాయకష్టము చేయుచు కాలముగడిపి, కన్నబిడ్డ చేతనే ద్వేషింప బడుచు కుష్ఠురోగముతో మరణించిన దామె.

"నరకానికి నిచ్చెనలు" నవలలో సూర్యహాసకు చేజేతుల నేను సహవాసములకు లోనయి నరకమునకు నిచ్చెనలు వేసుకొనినది.

'నీహారిక నవలలో శారదాదేవి శేషగిరి రావును తొలుత పెండ్లాడినది. కారణాంతరముల వలన పెండ్లైన నాడే ఇరువురును దూరమైనారు. పిమ్మట శారదాదేవికి మరల వివాహమైనది. ఈ భర్తతో మనసు కలియని మనుగడను సాగించుచుండగా; శేషగిరిరావు ఆమె జీవితమున ప్రవేశించినాడు. వారి నడుమ వలపు పరీమళములు గుబాళించినవి. అయినను వ్యవస్థ వీరి ప్రణయమునంగీకరింప జాలనందున మానసిక సంఘర్షణకు లోనయి తనకు తాను సంఘమునకు బలి చేసుకొనినది శారదాదేవి.

'వనకెన్నెర' యందు వివాహిత యగు శ్యామలి వివాహితుడగు జమీందారును మనస్ఫూర్తిగా ప్రేమించినది. అయినను కడకు శ్యామలి పశ్చాత్తాపమునకు మానసిక సంఘర్షణకు లోనైనది.

'దీపకళిక' నవలయందు వివాహితుడగు త్యాగరాజునకు సందర్భవశమున దగ్గరైన ఆబాల్యస్నేహితురాలగు సుమతి అన్నపూర్ణ నిర్దేశము ననుసరించి, సాంఘిక మర్యాదల నతిక్రమింప లేక ఎటకో సాగిపోయినది.

'మిస్ మోహిని' లో ఆత్మాభిమానము గల ఆధునిక యువతి మోహిని. తాను వివాహమాడిన రమేష్‌కు నవలారంభము నుండి విడాకు లివ్వవలె నని తలంచియు నవలాంతమునకు అతడినే కలుసుకొనినది.

'భగవంతుని పంచాయితీ' లో జయరావు భార్య రూపసి. విహారిని రహస్య వివాహము చేసికొనినను మానసిక సంఘర్షణకు లోనయి, నవలాంతమునకు వ్యవస్థకు లొంగినది.

పాతివ్రత్యము స్త్రీలకు భూషణము అట్లయినను దురహంకారముతో, మూర్ఖత్వముతో ప్రవర్తించిన, జీవిత నాశము తప్ప దని 'పథవిహీన' లో విజయపాత్ర స్పష్ట మొనరించును.

సమాజపు కట్టుబాట్లను సరకు చేయక తను వాంఛించిన జీవితము నెన్నుకొనిన "ఆదిమధ్యాంతాలలో" తాయారు కడకు వ్యవస్థ వ్యక్తికి కల్పించెడి భద్రతను కాదనలేక పోయినది.

కొంతవరకు వ్యవస్థను కాదనుటకు వీలులేదను 'లత' వ్యవస్థతో నిమిత్తము లేని ప్రణయమందు సుఖశాంతులను 'వారిజ' లో చూపించినారు. వివాహితుడైన మోహనమూర్తిలో వారిజ ప్రేమను వర్ణించుచునెడ- వీరి ప్రేమ జన్మజన్మల నుండి వచ్చుచున్నదని- వీరిరువురిని గోలుకొండ కోటకు గొంపోయి, వారి పూర్వజన్మ వృత్తాంతములను స్ఫురణకు తెప్పించి, పరితలచే వారి ప్రణయమును అంగీకరింపజేయుటకై యత్నించినారు.

ఈమెకు కొన్ని అధి మానసిక శక్తుల పట్ల నమ్మికలు కలవు. పునర్జన్మ సిద్ధాంతముల పట్ల నమ్మిక, "దెయ్యాలు లేవూ?" "పిచ్చివాళ్ళస్వర్గం" 'నీలినీడల'లో వ్యక్తపఱచారు. అతీంద్రియ శక్తులను గురించి "తిరగబడిన దేవతలు" బాణావతి విద్య గురించి 'అగ్నిగుండం' నవలలు వ్రాశారు.

భగవంతుని జేరుటయే జీవిత పరమార్థమనెడి భారతీయ సిద్ధాంతము 'లత' "నీలినీడలు" నవలలో కాన్పించును. వర్ణ వ్యవస్థను సమర్థించెడి లత "జీవన స్రవంతి"లో కిష్టయ్య భార్య రామమ్మ గారికంటె వేశ్యాకులమునకు చెందిన సభారంజనికి ఔన్నత్యము ప్రసాదించి, కిష్టయ్యగారితో ప్రాణము విడిచిన పతివ్రతగా చిత్రించినారు.

యాభై సంవత్సరములకు పూర్వము ఆంధ్రదేశపు బ్రాహ్మణ కుటుంబముల లోని ఆచారవ్యవహారములు, నమ్మికలు "ఆదిమధ్యాంతాలలో". "జీవనస్రవంతి" 'రక్తపంకం,' "నీలినీడలు" మున్నగు నవలలలో కొంతవరకు చూడవచ్చును.

ప్రేమ తత్త్వము :

మోహనవంశిలో రాధ ప్రేమమయి. "ప్రేమే ప్రేమకిమూలం. నా ఉద్దేశంలో విశ్వమంతా ప్రేమ బంధంతోనే చైతన్యవంత మవుతున్నది. ఈజీవితంలో విముక్తికి హేతువు కూడా ప్రేమే, అదీగాక ఒక వ్యక్తికిగాని ఒక ప్రయత్నానికి గాని సార్థకత కలుగ చేసేది కూడా ప్రేమే-" (పుట 170-మోహనవంశి)

ఇట్టి రాధికా ప్రేమ తత్త్వమును జీర్ణించుకొని, మానవుడగు శ్రీకృష్ణుడు భగవంతుడైనాడని లత సిద్ధాంతము.

తనను ఆరాధించి ప్రేమించిన తపతి. నీరజ చంద్రిక, కుబ్జలకు, అష్టమిహిషులు, లకు యశోదానందులకు- వీరు వారననేల! తనను ప్రేమించిన సర్వులకు కృష్ణుడు నిర్వ్యాజమైన ప్రేమను పంచిపెట్టినాడు.

వ్యక్తులనడుమ హృదయములను ఆర్ద్రీకరింపచేసెడి ఇట్టిఉదాత్తప్రేమ భావము లత ఇతర నవలలలో కాన్పించును. 'నీహారిక' నవలలో శౌరిది ఇట్టి ఉదాత్త పాత్ర. శారదాదేవిని కన్నకుమారుడు, కుమార్తె ద్వేషించుచున్నను శౌరి యామె యెడల ప్రేమ భావమును కనబఱచి కష్ట సుఖములందామె కుటుంబమునకు దోడునీడ అయినాడు.

"పథవిహీన'లో జగన్నాథం ప్రేమించిన చిట్టి తనను ప్రేమించక మురళిని ప్రేమించినను, కష్టసమయములో నామె నాదుకొని ఆశ్రయమిచ్చి, వివాహము చేసినాడు.

'మహాయాత్ర'లో ఇంజనీరగు ఆశాదేవి తాను నిర్మించిన విమానములో ధ్రువలోకమున కేగి అచట రాజగు ప్రియదర్శనుని ప్రేమించి అతడి ప్రేమను పొంది మరల భూలోకమునకు తిరిగి వచ్చి, జీవితాంతము ప్రియదర్శనుని ఆరాధనలోనే కాలము గడపి, కడకు అతడి స్వరమును రేడియోట్రాన్స్‌మీటర్లద్వారా విని ప్రాణములు విడిచిన గాఢ ప్రేమికురాలు.

'భగవంతుని పంచాయితీ' లో జయరావును శత్రువుల బారినుండి రక్షించిన నిర్మల ప్రేమమూర్తి ఆగ్నెస్, "సప్తస్వరాలు" నవలలో తన స్నేహితురాలి బిడ్డకొఱకు తనజీవితమును త్యాగమొనరించిన విశ్వమూర్తి, "మిగిలిందేమిటి?" ప్రేమించిన ప్రియుని కొఱకు నిరీక్షించుచు జీవితమును గడిపిన విద్యారాణి, ఈ కోవకు చెందిన ఉదాత్తపాత్రలు.

"మోహనవంశి" 'వనకిన్నెర', 'ఆదిమధ్యాంతాలలో' నవలలు పరిశీలించిన యెడల సత్యధర్మములకు ప్రాధాన్యమునిచ్చుచు, స్త్రీపురుషులు స్వేచ్ఛగానుండెడి సమాజము దేవభూమి అనియు అట్టి సమాజ జీవితమున మానవులకు సుఖశాంతులు లభ్యమగు ననియు రచయిత్రి అభిప్రాయపడుచున్నట్లు స్పష్టమగుచున్నది.

ఒక వంక వివాహ వ్యవస్థపట్ల గౌరవమును వ్యక్త పఱచుచు, నైతిక విలువలు నేడు దిగ జారుతున్నవని, "సంప్రదాయంమీద నీలినీడలు" వ్యాపించుచున్న వని విచారించుచున్న రచయిత్రి వేరొకవంక స్త్రీపురుషుల స్వేచ్ఛా జీవితమును కోరుచుండుటచే- ఈమె కొన్ని ముఖ్యసమస్యల పట్ల నిర్దిష్టాభిప్రాయమునకు రాలేక పోవుచున్నట్లు తోచును.

—…—

సవ్యాఖ్యము :

# ఏసుకృష్ణీయము

( ద్వ్యర్థి - పంచపద్యప్రబంధము )

- అష్టావధాని శ్రీ గాడేపల్లి కుక్కుటేశ్వరరావు, ఎం. ఏ.

మరియలోలత నెలలు సమాప్తి నమర
జంతుసాక్షిక నిర్బంధశాలలోన
దేవకీలాభమూర్తియై దేవదేవుఁ
డవనిఁ బ్రభవించె దైవజ్ఞు లాత్మనలర.

ఆతఁ డానందజనకత నల్లఁ బెరిగి
యేసుజనరక్షకఖ్యాతి నెసఁగి, గొల్లఁ
డై నిజాధీనపశువుల నరసి కాచి
కొనుచు, విహరించెఁ గొండలకోనలందు.

సత్యభామా కరగ్రహ సరసతత్త్వుఁ
డగుచు, ధర్మజయమున నిత్యాభిమాన
మొదవ నాశీలి యరివర్గవిదళనమున
దండిమగఁ డాయె; నరబోధకుండు నాయె.

ఆ పుడమిఱేడు దుశ్శాసనాభిమాని
రాక్షసుఁడు, దేవసూతిపై రవులు కక్షఁ
బట్టిబంధించి శిక్షింపవలయు ననుచుఁ
బన్ను నతఁ డింక నేమి కానున్నవాఁడొ!

పాపభారము బుజమున వైచికొనిన
దైవమకట! కిరాతయూథపతి బారి
యినుపశూలముపాదభంజన మొనర్పఁ
బ్రాణములువాసెఁ; స్తంభరూపతవహించె.

ఏసుపరముగా ప్రతిపదార్థము :

1వ పద్యము: మరియ=మరియమ్మ అను కన్య, లోలతన్=ఆందోళనతో, నెలలు సమాప్తిన్=గర్భవతిగ్గు నెలలు నిండుటచే, అమరన్=ఒప్పియుండఁగా, జంతుసాక్షిక=పశువులు నిల్చి చూచుచున్న, నిర్బంధశాలన్ = ఆపశువులు బంధింపఁబడిన పాకయందు, దేవ = దేవసంబంధమైన, కీలా = అగ్నియొక్క తేజస్సుతో, ఆభ = సమానమైన, మూర్తియై = ఆకారము కలవాఁడై, దేవదేవుఁడు = దేవతలకే దేవుఁడని చెప్పఁదగిన క్రీస్తు, అవనిన్ = భూమిపైని, దైవజ్ఞులు = దివ్యనక్షత్రము ననుసరించి వచ్చిన ముగ్వురు తూర్పుదేశజ్ఞానులు, ఆత్మన్ = వారివారి మనస్సులయందు, అలరన్ = సంతోషింపఁగా, ప్రభవించెన్ = జన్మించెను.

తాత్పర్యము: మరియమ్మ ఆందోళన చెందుచుండగా నెలలు నిండినవి. అగ్ని తేజస్సుగల దేవదేవుఁడైన యేసు పశువుల పాకలో ఆమె కడుపున జన్మించెను. ప్రభుజననమునకు తూర్పుదేశ జ్ఞానులు సంతోషించిరి.

కృష్ణపరముగా ప్రతిపదార్థము: నెలలు= తొమ్మిది మాసములు, మరి + అలోలతన్ = ఏమాత్రము భంగపాటులేకుండ, సమాప్తిన్ = నిండుటచే, అమరన్ = ఒప్పియుండఁగా, జంతు_సాక్షిక = వసుదేవుడు కాళ్లుపట్టుకొనిన గాడిదనిల్చి చూచుచున్న, నిర్బంధశాలన్ = చెఱసాలయందు, దేవకీ = దేవకీదేవికి, లాభమూర్తియై = లభించినవాఁడై; దేవదేవుఁడు = విష్ణువు, అవనిన్ = భూమిపైని, దైవజ్ఞులు = దైవతత్త్వము నెఱిఁగిన అక్రూరుఁడు మొదలైనవారు, ఆత్మన్ = వారి వారి మనస్సులయందు, అలరన్ = సంతోషింపఁగా, ప్రభవించెన్ = జన్మించెను.

తాత్పర్యము: గర్భవిషయమున నెట్టి తొట్రుపాటు లేకుండ, నెలలు నిండినవి. ఎట్టయెదుట_గాడిదనిల్చి చూచుచున్న చెఱసాలయందు విష్ణువు దేవకీదేవికి జన్మించుట వలన లభించెను. కృష్ణతత్త్వము నెఱిఁగిన అక్రూరాదులు సంతోషించిరి.

2 వ పద్యము. ఏసుపరముగా అర్థము: ఆతఁడు = ఆబిడ్డఁడు, ఆనందజనకతన్ = ఎల్లరకు ఆనందము చేకూర్చువాఁడగుచు, అల్లన్ = క్రమముగా, పెరిగి = ఎదిగి, ఏసు=ఏసు అను పేరుచే, జనరక్షకఖ్యాతిన్ = జనులకు రక్షకుఁడు అను కీర్తిచేత, ఎసఁగి = ఒప్పి, గొల్లఁడై = గొల్లవారి వృత్తి నవలంబించినవాఁడై, నిజ + అధీన = తన వశమునందుండు, పశువులన్ = గొఱ్ఱెలను, కాచికొనుచున్ = త్రోలి కాపాడుకొనుచు, కొండలకోనలందున్ = కొండల కోనలలో, విహరించెన్=సంచరించెను.

తాత్పర్యము : ఆబిడ్డఁడు ఎల్లరకు ఆనందము చేకూర్చుచు పెరిగెను. ఏసు_ అను పేరుగల్గి, జనరక్షకుఁడను కీర్తిని గడించి, గొల్లవానివలె గొఱ్ఱెలను కాచుకొనుచు కొండలలో కోనలలో విహరించెను.

కృష్ణపరముగా అర్థము : ఆతఁడు = ఆబిడ్డఁడు, ఆ = అక్కడ నెక్కడనో యున్న; నందజనకతన్ = నందుఁడే జనకుఁడుగా కల్గియుండి (అనగా నందునకు కుమారుడై), అల్లన్ = క్రమముగా, పెరిగియే = ఎదిగిన వాఁడగుటచేత నే, సుజనరక్షకఖ్యాతిన్ = సజ్జనులను రక్షింపఁగలఁడను కీర్తిచేత, ఎసఁగి = ఒప్పి, గొల్లఁడై = గొల్లవాఁడై, నిజ + అధీన = తన వశము నందుండు, పశువులన్ = ఆవులను, అరసి = జాగ్రత్తగాఁ జూచుకొనుచు, కాచికొనుచున్ = త్రోలి కాపాడుకొనుచు, కొండలకోనలందున్ = కొండలలో కోనలలో, విహరించెన్ = సంచరించెను.

తాత్పర్యము . ఆబిడ్డఁడు నందుఁడే తండ్రిగా పెరిగెను. సుజనరక్షకుఁ డను కీర్తినిగడించి, ఆవులను కాచుకొనుచు, కొండలలో కోనలలో విహరించెను.

3. వ పద్యము:ఏసుపరముగా అర్థము:_ ఆశీలి = శీలవంతుఁడైన ఆపురుషుఁడు,

సత్య = సత్యము అను, భామా = స్త్రీని, కరగ్రహణ = చేపట్టుటచే, సరస = (దయా)రసముతోఁగూడిన, సత్త్వుఁడు + అగుచున్ = సత్త్వగుణ ప్రధానుఁడై, ధర్మ-జయమునన్ = ధర్మమే జయించి తీరవలెనను విషయమున, నిత్య + అభిమానము + ఒదవన్ = ఎడతెగని అభిమతము కలుగగా, అరివర్గ = కామ క్రోధలోభమోహమద మాత్సర్యములు అను అరిషడ్వర్గమును, విదళమునన్ = కొట్టివైచుటచే, దండి = ఉద్దండుఁడైన, మగఁడు + ఆయెన్ = వీరుఁడైనాఁడు, (అట్లే) నర = తనతోడివారైన నరులకు, బోధకుండున్ + ఆయెన్ = బోధకుఁడు కూడ నైనాఁడు.

తాత్పర్యము :- ఆశీలవంతుఁడు, సత్యము అను స్త్రీని చేపట్టి, దయారసము గలవాఁడై, సత్త్వగుణప్రధానుఁడై, ధర్మమే జయింపఁగలదను నిశ్చయముతో నుండెను. కామక్రోధాది అరిషడ్వర్గమును జయించి, తనతోడి జనులకు బోధకుఁడై విలసిల్లెను.

కృష్ణపరముగా అర్థము : ఆశీలి = శీలవంతుఁడైన ఆపురుషుఁడు, సత్యభామా = సత్యభామను, కరగ్రహ = వివాహ మాడుటచే, సరస = శృంగార రసముతోఁ గూడిన, సత్త్వుఁడు + అగుచున్ = దేవగుణమైన సత్త్వగుణముచే విశిష్టుఁడై, ధర్మజ = ధర్మరాజు యొక్కయు, యమున = యమునానదీ దేవత యొక్కయు, నిత్య + అభిమానము = ఎడతెగని పూజ్యభావము, ఒదవన్ = తనయందు కలుగగా, అరివర్గ = శత్రువులైన కౌరవాదులను, విదళనమునన్ = సంహరించు విషయమునందు, నర = అర్జునునకు, బోధకుండున్ = గీత బోధించిన వాఁడును, ఆయెన్ = అయినాఁడు, దండి-మగడున్ = గొప్ప వీరుఁడును, ఆయెన్ = అయినాఁడు.

తాత్పర్యము :- ఆశీలవంతుఁడు సత్యభామను వివాహమాడి సరసుఁడై సత్త్వగుణ విశిష్టుఁడై, ధర్మరాజు యొక్కయు యమునానదీ దేవత యొక్కయు అభిమానమును పొందెను. కౌరవాది శత్రు సంహార విషయమున అర్జునునకు భగవద్గీత బోధించెను.

4. వ పద్యము ఏసుపరముగా అర్థము :- ఆపుడమి ఱేఁడు = ఆయూదు వంశపురాజు, దుశ్శాసన = చెడ్డశాసనములు చేయుటయందు, అభిమాని = ఇచ్ఛగలవాఁడు, కంసుఁడు = మహాక్రూరుఁడు, దేవసూతిపై = దేవుని కుమారుఁడైన యేసుపై, రవులు కక్షన్ = రగులుచున్న ద్వేషముతో, పట్టి-బంధించి = పట్టుకొని నిర్బంధించి, శిక్షింపవలయును + అనుచున్ = దండింపవలెనని, పన్నున్ = ప్రయత్నించుచున్నాఁడు, ఆతఁడు = ఆఏసు, ఇంకన్ = ఇఁక మీఁదట, ఏమి-కానున్నవాఁడో = ఏమి కాఁబోవుచున్నాఁడోకదా! (మృత్యువునకు గురి కానున్నాఁడు- అని ధ్వని.)

తాత్పర్యము : ఆయూదు వంశపురాజు మహాక్రూరుఁడు, భయంకర శాసనములు చేయు స్వభావము కలవాఁడు; దేవుని కుమారుఁడైన ఏసుపై కక్షఁబూని యున్నాఁడు. ఎట్లైనను పట్టి బంధించి శిక్షింప వలెనని ప్రయత్నించుచున్నాఁడు. పాపము! ఆఏసు ఏమి కానున్నవాఁడోకదా!

కృష్ణపరముగా అర్థము : ఆ పుడమి ఱేఁడు = రాజైన ఆదుర్యోధనుఁడు, దుశ్శాసన = తమ్ముఁడైన దుశ్శాసనునకు, అభిమాని = గౌరవపాత్రుఁడు, కంసుఁడు = కంసాంశతో జన్మించిన వాఁడు, దేవసూతిపై = వసుదేవ కుమారుఁడైన కృష్ణునిపై (నామమునందు ఏకదేశగ్రహణము శాస్త్రసమ్మతముకదా!), రవులు - కక్షన్ = రగులుచున్న ద్వేషముచే, (కృష్ణుఁడు రాయబారమునకై వచ్చినపుడు) పట్టి-బంధించి = పట్టుకొని త్రాళ్లతోఁగట్టి, శిక్షింప - వలయును + అనుచున్ = దండింపవలెనని, పన్నున్ = ప్రయత్నించుచున్నాఁడు, ఆతఁడు = ఆదుర్యోధనుఁడు, ఇంకన్ = ఇఁకమీఁదట, ఏమి-కానున్నవాఁడో = ఏమికాఁబోవుచున్నాఁడోకదా! (మృత్యువునకు గురికానున్నాఁడు - అని ధ్వని.)

తాత్పర్యము :- దుర్యోధన నృపతి కంసాంశతో జన్మించిన వాఁడు తమ్ముఁడైన దుశ్శాసనునకు గౌరవపాత్రుఁడు. వసుదేవసుతుఁడైన కృష్ణునిపై కక్షనుబూని పట్టుకొని త్రాళ్లతో బంధించి శిక్షింపవలెనని ప్రయత్నించుచున్నాఁడు. ఆదుర్యోధనుఁడు ఏమి కానున్న వాఁడోకదా!

5 వ పద్యము: ఏసుపరముగా అర్థము- పాప- భారము = ఎల్లజనుల పాపము అను భారమును, బుజమున = తన భుజముపై, వైచికొనిన = వహించిన, దైవము = దేవుఁడైనయేసు, అకట! = అయ్యో! కిరాత = కసాయి హృదయము గల, యూధపతి = యూదు వంశపు, రాజు యొక్క, బారి = వశమున నున్న, ఇనుప-శూలము = శూలము వంటి యినుప మేకు, పాద- భంజనము + ఒనర్పన్ = రెండు పాదములను చీల్చుకొనుచు దిగఁగా, ప్రాణములు + పాసెన్ = ప్రాణములు విడిచెను; స్తంభ - రూపతన్ = శిలువయొక్క ఆకారమును వహించెనున్ = (ఏసు) ధరించిన వాఁడాయెను.

తాత్పర్యము:- సకలజనుల పాపభారమును మోసికొని వచ్చిన యేసు, క్రూరుఁడైన యూదులరాజునకుఁ జిక్కెను. ఇనుప మేకును రెండుపాదముల నుండి గించి కొయ్యకు నాటఁగా ప్రాణములు విడిచి శిలువరూపమును ధరించెను.

కృష్ణపరముగా అర్థము. భారము = భూభారమును, పాపన్ = తొలగించు

## ఉగాది కోరిక

విద్వాన్ శ్రీ బులుసు
వేంకటేశ్వరులు, ఎం. ఏ.

శ్రీ సిద్ధార్థి సమస్త వాంఛితములన్
 సిద్ధిల్లగాఁ జేయుఁగా
కీసంవత్సర మన్నిరీతుల శుభం
 బే యిచ్చుఁగాఁతన్ జగా
శాసంసిద్ధిని సార్థ కాఖ్యమగుతన్
 సత్యంబు ధర్మంబులే
శాసింపంగనుఁగాక నాయకుల నా
 శారేఖ కన్పింపఁగన్.

మాయమయిపోవు బుతము ధర్మమ్ము నిత్య
నూతనంబుగ నిల్చుత! ఖ్యాతములగు
భారతీయమహాదర్శ పరిశములు
దశదిశలవ్యాప్తిఁగనుఁగాక! ధరణిపయిని.
ధరణి భాషల కెల్లను నొరవడి యగు
అమృత సుందర పరమాంధ్ర విమలభాష
ఉజ్జ్వలంబయి శోభిల్లు చుండుఁగాక
తన సదాచారముల్ సనాతనత నిలిపి.

---

( 8 వ పేజీ తరువాయి )

టకై, బుజమున- వైచికొనిన = తన బాధ్యతగా స్వీకరించిన, దైవము = దేవుఁడైన కృష్ణుఁడు, అకట = అయ్యో, కిరాత - యూధ = బోయవారి సమూహమునకు, పతి = నాయకుఁడైన వాని యొక్క, బారి = వశమునందున్న, ఇనుప-శూలము = ఇనుముతో చేయఁబడిన ముపలశకలము, పాద-భంజనము + ఒనర్చన్ = పాదమును చీల్చుకొని పోఁగా, ప్రాణములు + పాసెన్ = ప్రాణములు విడిచెను; స్తంభ-రూపత = స్తంభము అను నిశ్చేష్టాస్థితిని, వహించెన్ = (కృష్ణుడు) పొందినవాఁడాయెను.

తాత్పర్యము.- భూభారమును బాపుట తన బాధ్యతగా స్వీకరించిన కృష్ణుఁడు, కిరాతుఁడు ప్రయోగించిన ఇనుపములుకు కల బాణము పాదమును చీల్చివైవఁగా ప్రాణములు విడిచి నిశ్చేష్టాస్థితి నొందెను.

---

# శ్రీ నీలకంఠేశ్వరా!

- శ్రీ "కవిగణపతి"

నాగో నీశతవృత్తపూర్ణ కృతిక
 న్యామంజులాపాంగధా
రాదత్తాసిత కైరవ ప్రతతిచే
 రాగమ్ము మెుల్కొత్త భ
క్తాదుల్ వృత్తపదార్థపూజనమున
 ట్లామోదమున్ పొందరా!
శ్రీమద్గాత్తనవృత్తభూషణకరా!
 శ్రీ నీలకంఠేశ్వరా!

యతులున్ రీతులువృత్తముల్ దనరద ధ్వ
 న్యాత్మప్రయుక్తిన్ రస
ప్లుతితో సాగు సజీవకావ్యము లనన్
 బొల్పారుగరా! దేహముల్,
పతి వీ; వాకృతులన్ ధరించు తమితోఁ
 బాణిద్వయం బెత్తరా!
శితికంఠా! దశకంఠసంస్తుత గుణా!
 శ్రీ నీల కంఠేశ్వరా!

గంగా స్వేదమ, యుష్మరంట
 ఫణిఘూత్కారంబ, గోరొమ్కస్కసా
రంగాంకాభము నీకు గౌరికనుచో
 త్ర్యక్షా! భవత్సంగమం
బంగంబయ్యె, సురాపగాహిశశి గి
 వ్యాలంకృతుల్ గల్గునీ
శృంగారం బెరుగంగ నేరితరమా?
 శ్రీ నీల కంఠేశ్వరా!

అలచింతామణి కామధేనువును గ
 ల్పాగంబు నీచే సుగా
జలధింబుట్టి సురాళి కీయఁబడె, నీ
 చాతుర్యమేమందు? వా
రలకున్ భోజనమా సుధానిధిని మా
 త్రంబుంచు కొన్నావు, వ
ర్ధిలగా నెంచినవారు చేరుదురు నిన్
 శ్రీ నీల కంఠేశ్వరా!

ఏ పేరో! ఎదియూరో! ఉండునది నీ
 దేగుట్టో! ఏగుట్టో! నీ
దేహాల్పో! ఎది పిల్పో! పట్టునది నీ
 దేవాలో! ఏయాలో! నీ
దేపన్నో! ఎదితెన్నో! చెప్పఁగలవాఁ
 డెవ్వాఁడు? ఎవ్వాఁడు ని
క్షేపంబట్టుల నిన్ను దాఁచునెదలో?
 శ్రీ నీలకకంఠేశ్వరా!

అరవిందాస్త్రుని తేజితోడ నరవిం
 దాస్యల్ రహస్యంబుగా
మరు డెట్లుండునటన్న తుట్టుమని వో్య
 మంబంటు చందమ్మునన్
పరతత్త్వం బడుగంగ మాని వృషభుల్
 పట్టించుకోలేరు, చె
చ్చెర నిన్నుం గనఁజాలు జ్ఞానియెకదా!
 శ్రీ నీలకంఠేశ్వరా!

ఘనమోహంబె పునాది కామమది ప్రా
 కారంబు మాత్సర్యమే
గోనబా ద్వారము క్రోధమే శిఖరమై
 కూడంగ లోభాలయం
బున నంచన్మద దీప్తి క్రాలగ మనం
 బున్ మూర్తిగాఁ గూర్చితే?
చెనటుల్ మాయకు లొంగిపోయి చెడగా
 శ్రీ నీలకంఠేశ్వరా!

లేలీహాన సమూహవేష్టితము వ
 ల్మీకంబు నీమూర్తి యం
గేలాగైన సమస్తమానిధులు వా
 సించున్, గొనంబోవగా
నాలో నాత్మబలం బపార; మయినన్
 నాకెందు కాయాశ? నా
శీలంబన్నది నాకు పెన్నిధికదా!
 శ్రీ నీలకంఠేశ్వరా!

---

# భగవద్గీత

—శ్రీ మల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తి, ఎం. ఏ.

'ఈనాటి సమాజంలో భగవద్గీతకు స్థానం లేదు అని హేతువాదులు అంటారు ఈ వాదాన్ని ఎలా ఖండించవచ్చు' అనే ప్రశ్నకు సమాధానంగా ది.19-11-78 వ తేదీని విశాఖ భగవద్గీతా జయంతి సమితి వారు నిర్వహించిన వ్యాస రచన పోటీ పరీక్షలో విశ్వవిద్యాలయ స్థాయిలో ప్రథమ బహుమతి పొందిన వ్యాసం ఇది.

మానవజీవితం చాలా విచిత్రమైంది. ఎంతో ఆనందంగా ఉన్నట్లు భ్రమ గొల్పుతుంది. కాని వాస్తవంగా నిరంతరం ఎన్నో చిక్కులు, చికాకులు. శాస్త్ర విజ్ఞానంతో మానవుడు తన మేధాశక్తిని పెంచుకుని ఈ సమస్యల్ని పరిష్కరించే మార్గాన్ని అన్వేషిస్తున్నాడు. మానవ విజ్ఞానం పెరిగినకొద్దీ సమస్యలూ పెరుగుతున్నాయి. భౌతిక ప్రపంచంలో ఎదురయ్యే ఈ సమస్యల పరిష్కారం కోసం ఆధ్యాత్మిక ప్రపంచం వైపుకి దృష్టి సారించాలి.

జీవసృష్టిలోనే ఉత్కృష్టమైంది మానవజన్మ. సదసద్వివేచనశక్తి, ఆచరణ సమర్థత మానవుడి సొత్తు. చైతన్యపరిధిని విస్తృతంచేయగల విజ్ఞానంతో, శీలనిర్మాణ సమర్థమైన ఉత్తమవిద్యతో మానవుడు తన కర్తవ్యాన్ని గుర్తించాలి. నిర్విరామ కృషితో అంతిమ లక్ష్యాన్ని అందుకుని, జీవితపరమార్థాన్ని సాధించాలి.

ఈవిధమైన ఆధ్యాత్మిక విజ్ఞానము, ఆలోచన అర్థరహితంగా, కల్పనాభూయిష్ఠంగా కన్పడుతుంది హేతువాద దృక్పథానికి. శాస్త్రీయ విజ్ఞానాభివృద్ధిని సాధించిన ఈ యుగం హేతువాద యుగం. ప్రతి-అంశాన్ని హేతువాద ప్రమాణంతో ఆలోచించి, విలువలు నిర్ణయించడం ఈ యుగధర్మమైంది. హేతువాదుల దృష్టికి భగవద్గీత ఈనాటి సమాజంలో స్థానంలేనిదిగా కన్పించింది.

మానవుడు నిస్సహాయుడు కాగా, దైవమే అండగా నిలిచి, వెన్ను తట్టి ప్రోత్సహించిన ధర్మప్రబోధమే భగవద్గీత. మనుకారం మనో వ్యాకులతను కలిగించగా కర్తవ్యతా విముఖుడయ్యాడు అర్జునుడు. 'కార్పణ్య దోషోపహత స్వభావు' ణ్ణని స్వయంగా చెప్పుకున్నాడు. అటువంటివాడు, సమర్థుడు, సర్వశక్తిమంతుడు అయిన భగవంతుణ్ణి కర్తవ్యోపదేశం కోరడం వింత కాదు కదా! అనాదిగా మానవుడు దైవంతో ఇలాగే అనుబంధాన్ని పెంచుకున్నాడు. వ్యవసాయమే బ్రతుకు తెరువుగా ఉన్న తొలినాళ్లలో మానవుడు, ప్రకృతిశక్తికి కైమోడ్చి ప్రార్థించాడు. తమ ప్రార్థనలు విని, తమను కనికరిస్తున్న దైవాన్ని రక్షకుడిగా, తల్లిగ, తండ్రిగ భావించి 'త్వం త్రాతా తరణే చేత్యో భూః పితా మాతా సదమిన్మానుషాణాం' అంటూ ఋగ్వేదఋషులు కీర్తించారు. కాబట్టి ఆస్తిక్యభావన మానవజీవితౌన్నత్యానికి పునాది అన్నమాట.

ఆధునికయుగంలో శాస్త్రీయవిజ్ఞాన ప్రగతివల్ల హేతువాదం విజృంభించింది. ప్రతిఅంశాన్నీ ప్రశ్నిస్తూ మానవుడు, తన మేధాశక్తినే నమ్ముకుని, భౌతిక దృక్పథాన్ని పెంచుకున్నాడు. తనకు సమాధానాలు దొరకనివాటిని అసంబద్ధములని తీర్మానించుకున్నాడు. మానవ హృదయగతమైన నమ్మకంపైఆధారపడినఆస్తిక్య భావన హేతువాదుల ప్రశ్నలధాటికి నిలబడలేక జీవితాన్ని నడిపే శక్తిగా చాల బలహీనపడింది. చివరికి హృదయం శుష్కమైపోయి, జీవితం నిస్సారమైంది. ఎన్ని జీవిత సౌఖ్యాలున్నా, మనశ్శాంతి కరువైంది.

హేతువాదం అవసరమే. అయినా, దానికీ ఒక అవధి ఉంది. మానవ హృదంతరాళంలో తర్కానికి లొంగని నిర్హేతుక ప్రవర్తన /'ఇడ్'అనే పేరిట/ ఉంటుందని ప్రసిద్ధ పాశ్చాత్యమనస్తత్వ శాస్త్రవేత్త 'ఫ్రాయిడ్' కూడా అంగీకరించాడు.

భగవద్గీత నిస్సందేహంగా సార్వకాలికమైన ధర్మప్రబోధం గల గ్రంథం. అయితే, ఇది సంధియుగం. వర్తమాన కాలంలో ప్రతి అంశాన్ని గురించి సందేహించే పరిస్థితి ఎక్కువైంది. సంస్కృత భాష, తత్సంబంధమైన జీవనవిధానంలో ఉన్న ఉత్తమ సంస్కారాభినివేశాభిరుచులు ఇటీవలికాలంలో కొంత లోపించాయి. అందువల్ల గీతాధ్యయనావశ్యకత చర్చనీయాంశమైంది.

భగవద్గీతలో చెప్పబడిన కర్మసన్న్యాసము, సర్వధర్మ పరిత్యాగపూర్వకమైన ఆత్మార్పణము, వర్ణాశ్రమాచార ధర్మ వివరణము హేతువాదం ప్రకారం అర్థరహితంగా, అనర్థదాయకంగా కన్పిస్తాయి. కర్మసన్న్యాస [కర్మలను విడిచిపెట్టడం అని స్థూలమైన అర్థం]ప్రబోధం మానవులను నిష్క్రియులను చేస్తుందనుకోవడం సమంజసం కాదు.

గీతాప్రబోధం విని అర్జునుడు కార్యోన్ముఖుడైనాడు కదా! 'నహి కశ్చిత్ క్షణమపి జాతు తిష్ఠత్యకర్మకృత్' అని కర్మయోగం. కర్మలను ఆచరించకుండా మానవుడు ఒక్క క్షణమైనా ఉండలేడు. అందుకే కర్మాచరణాన్ని విడిచిపెట్టడం కాదు. కర్మఫలత్యాగమే కర్మసన్న్యాసం. ఫలితాన్ని ఆశించకుండా కర్తవ్యనిష్ఠతో మానవుడు కర్మలనాచరించాలి. 'కర్మణ్యే వాధికారస్తే మా ఫలేషు కదాచన' అని గీతావాక్యం. ప్రతిఫలంమీద దృష్టి

లేకుండా కర్తవ్యాన్ని నిర్వహించడం అన్నమాట.

ఆధునికులు సామ్యవాదసిద్ధాంత వ్యవస్థను సమర్థిస్తారు. ఆస్తిహక్కు ఉండరాదని, వస్తూత్పత్తివల్ల వచ్చేలాభం వ్యక్తులకు కాక ప్రభుత్వానికి చెందాలని అప్పుడే సమానత్వం సాధ్యమని సామ్యవాదం. భగవద్గీత చెప్పే కర్మఫలత్యాగం కూడా ఇటువంటిదే. ప్రతిఫలంమీద, దృష్టి లేనప్పుడే మనస్సు కర్తవ్యనిర్వహణలో పూర్తిగా నిమగ్నమవుతుంది. ఫలితం తనది కాదుకాబట్టి కర్మాచరణలో నిరాశను, దురాశను లోనుగాకుండా సమభావంతో ప్రసరించగలుగుతాడు. మానవుల మధ్య ఈవిధమైన సమదృష్టి ఏర్పడినప్పుడు స్వర్గతుల్యమైన సమాజాన్ని స్థాపించుకోగలుగుతారు.

మానవుణ్ణి తీవ్రంగా ప్రభావితంచేసేది హృదయం. హృదయధర్మానికి కట్టుబడి ప్రవర్తించే మానవుడు జీవితంలో ఎక్కడైనా తప్పటడుగువేసే అవకాశం లేకపోలేదు. అందుకే, ఆత్మసంయమనం అవసరమన్నాడు గీతాకారుడు. నిగ్రహంలేక ఎవరైనా తప్పుచేస్తే, జీవితం పాపపంకిలమైపోయిందని నిస్పృహ చెందనక్కరలేకుండా సర్వాంతర్యామిని ఆశ్రయిస్తే దుఃఖవిముక్తి సాధ్యమవుతుందని ప్రబోధించడం అవసరం. అందుకే, 'సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ' అన్నాడు శ్రీకృష్ణుడు. అలా శరణాగతిద్వారా ఉత్సాహాన్ని పొంది, మానవుడు కర్మ యోగాభ్యాసకుశలుడై కర్తవ్యనిర్వహణ సమర్థతను పెంచుకుంటాడు. కార్యసిద్ధి, కార్యవిఫలతలపట్ల సమభావనము. ఫలత్యాగబుద్ధితో కర్మాచరణం చేసే కౌశలము యోగ మని వివరించాడు. 'సమత్వం యోగ ఉచ్యతే' - 'యోగః కర్మసు కౌశలం' అంటూ 'యోగస్థః కురు కర్మాణి' అని ఆదేశించాడు. యోగివై కర్మాచరణం ప్రారంభించమని ప్రబోధించడంలో ఇంతటి అంతరార్థం ఉన్నది.

భగవద్గీత పేర్కొన్న వర్ణాశ్రమాచారధర్మం ఈనాటి సమాజానికి తగినట్లు లేదనే అభిప్రాయం ఒకటుంది. 'చాతుర్వర్ణ్యం మయాసృష్టం' - 'గుణకర్మ విభాగశః' అని జ్ఞానయోగశ్లోకాన్నిబట్టి గుణకర్మవిభాగమే చాతుర్వర్ణ్యవ్యవస్థకు ఆధారమని తెలుస్తోంది. గుణ మంటే మనోధర్మం. కర్మ అంటే భౌతికమైన క్రియ. ఏ పనిచేయకుండా ఎవ్వరూ ఉండలేనట్లే అందరూ అన్ని పనులూ చేయలేరు. మనోధర్మాన్నిబట్టి, కర్మకలాపాన్నిబట్టి ఆదిలో వర్ణవిభాగం ఏర్పడింది. ఈనాటి ఉద్యోగ వ్యవస్థ ఇలాగే రూపొందిందని చెప్పవచ్చు. శ్రమవిభజన పద్ధతి మన సమాజంలో ఉన్నదికదా! ఇలా నిరంతరకర్మాచరణం ద్వారా మనం పురోభివృద్ధిని సాధించుకోగలుగుతాం.

ఇలా భగవద్గీత ప్రబోధించే ప్రతి అంశంలోను సార్వకాలికమైన ధర్మనిష్ఠ కనిపిస్తుంది. స్వధర్మనిర్వహణ మెంత అవశ్యకమో కర్మయోగంలోను, మోక్షసన్న్యాసయోగంలోనూ కూడ వివరించబడింది. 'శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్' అంటూ పరధర్మం మంచిదైనా పరిహరణీయ మని, స్వధర్మం తక్కువదైనా విడిచిపెట్టడానికి వీలులేదని చెప్పబడింది. స్వధర్మనిర్వహణలో సాధించే నైపుణ్యం పరధర్మాచరణంలో సాధించడం కష్టం కనుక. కార్యభంగ మవుతుందనిఉద్దేశం. మానవులు పాటించే లౌకికాది వృత్తిధర్మం కూడా స్వధర్మమే అవుతుందని బాలగంగాధరతిలక్ వ్యాఖ్యానించారు. కర్తవ్యం ఎటువంటిదైనాసరే, దాన్ని సక్రమంగా నెరవేర్చాలనేదే గీతా సందేశం.

మానవాళికి నిజమైన, శాశ్వతమైన ఆనందాన్ని, శాంతి సౌఖ్యాలను అందించడం కోసమే భగవద్గీతాధర్మప్రబోధం. మానవుల మనోధర్మం ఏ కాలంలో అయినా ఒక్కటే. మానవ హృదయంలోని ప్రేమ, అనురాగము, క్రోధము, భయమువంటి భావాలు కాలానికి, కాలానికి మారవు. కాలంలో వచ్చే కొద్దిపాటి మార్పులవల్ల బహిఃస్వరూపం కొంత మారుతుందేమో గాని, హృదయాంతరాళంలో మాత్రం చెప్పుకోదగిన మార్పంటూ ఉండదు. సంఘంలోని మానవులమధ్య శాంతియుత సహజీవనానికి కావలసిన ధర్మాలు సర్వసాధారణంగా అన్నికాలాల్లోనూ ఒకేరీతిలో ఉంటాయి. క్రాంతిదర్శియైన మహర్షి మానవమనస్తత్వాన్ని సునిశితంగా పరిశీలించి మానవజీవితంలో నిరంతరం జరిగే పోరాటాన్ని సమీక్షించాడు. గీతాప్రబోధానికి భారతయుద్ధం కేవలమూ నిమిత్తకారణమే. జీవిత సంగ్రామానికి ప్రతీక భారతయుద్ధం. అహంకారమమకారాలు కారణంగా కర్తవ్యతావిముఖుడైన సామాన్యమానవుడికి సంకేతం అర్జునుడు. హృదయదౌర్బల్యం మానవుడి కర్తవ్యతానిష్ఠను దెబ్బతీస్తుంది. అందుకే 'క్షుద్రం హృదయ దౌర్బల్యం' - 'త్యక్త్వా ఉత్తిష్ఠ' అని జాగృతం చేస్తున్నది గీతావాణి. ఇలాంటి ప్రబోధం వల్లనే భగవద్గీత ప్రత్యేక మతగ్రంథంగా కాక, మానవాభ్యుదయాని కనువైనపూర్ణయోగశాస్త్రమై యుగాల తరబడి నిలిచిఉంది. కార్యసాధనకు చాలినంత మనస్థైర్యం లేనివారికి ధైర్యాన్ని ప్రసాదించి, కార్యోన్ముఖులను చేసే సమర్థత గీతాశాస్త్రానికి ఉంది.

'అశోచ్యా నన్వశోచ స్త్వం' అని హెచ్చరించి, జనన మరణాలు ప్రకృతిసిద్ధమైనవని, అపరిహార్యమైన ధర్మానికి శోకించడం తగదని అర్జునుణ్ణి యుద్ధానికి ప్రోత్సహించాడు శ్రీకృష్ణుడు. అందుకే, ఈ దృక్పథంలో భగవద్గీత సార్వకాలికమైన గ్రంథం.

యోగము, ఆధ్యాత్మిక సాధన భగవద్గీతలో ఉన్నాయి. స్వార్థపరులెవరైనా కొంద రీసాధనను స్వప్రయోజనాలకోసం వినియోగిస్తే, వినియోగించవచ్చు. అందుకే, ప్రబోధంకాక, ఆచరణను గుర్తించాలి. పెద్దల ప్రబోధాన్ని కాక, పెద్దల ఆచరణాన్ని ఇతరులు అనుసరిస్తారని భగవద్గీత చెప్తోంది. 'యద్యదాచరతి శ్రేష్ఠ స్తత్తదే వేతరోజనః' మానవుడిలో సహజాతంగా ఉండే అనుకరణ ప్రవృత్తిచేత సామాన్యులు శ్రేష్ఠుణ్ణి అనుసరిస్తారు. అనుకార్యులు సత్ప్రవర్తనులైతే అనుకర్తలు కూడా ఉత్తమమార్గగాము లవుతారు. కుటుంబంలో పెద్దలు సత్ప్రవర్తనను పాటిస్తే, బిడ్డలు సన్మార్గవర్తను లవుతారు. ఇలా తరతరాలకూ అవిచ్ఛిన్నంగా ముందుకుసాగుతూ, ఈ సత్సంప్రదాయం మానవులందర్నీ సద్వర్తన వర్తులను గావిస్తుంది సంఘమంతటికీ సంస్కృతి పరమైన సత్తువను, నైతిక బలాన్ని ఇస్తుంది. భావిపౌరులు మంచి నడవడిగలవారై, సంఘాన్ని ప్రగతి మార్గంలో నడిపించగలుగుతారు. అందుకే గీతాపఠనం ఏసమాజంలో అయినా అత్యంతావశ్యకం.

భగవద్గీతను ఆధ్యాత్మిక గ్రంథంగా మాత్రమే అంగీకరించదలచినా, అలాంటి సాధనకు గీతాకారుడు నిర్దేశించిన ధర్మసముదాయం మానవసంఘంలో నైతిక విలువలను, మానవుడికి చిత్తశాంతిని ప్రసాదించగల మహౌషధం. అందుకే దాన్ని 'ధర్మ్యామృతం' అన్నాడు. 'యో మద్భక్తః సమేప్రియః' భక్తుడే తనకు ప్రియుడని భక్తియోగంలో ప్రత్యక్షంగా చెప్పాడు. భక్తుడి లక్షణాలను వివరిస్తూ 'అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవచ' అంటూ ప్రారంభించాడు. సమదృష్టి, సహనశీలము, ఆత్మనిగ్రహము, సర్వభూతదయ, మొదలుగా గల ఉదాత్తమానవధర్మాలను పేర్కొన్నాడు. సాంఖ్యయోగంలో 'స్థితప్రజ్ఞుడు కాగల మానవుడే ఉత్తము డని పేర్కొంటూ పైలక్షణాలనే వివరించాడు.

దైవాసురసంపద్విభాగ యోగంలో కూడా సత్ప్రవర్తనకు కావలసిన ధర్మాలను దైవీసంపత్తుగా అభివర్ణించాడు.

'మానవసేవే మాధవసేవ' అనే భావాన్ని పాదుకొల్పుతూ, సత్ప్రవర్తనలో నుంచి దివ్యత్వాన్ని అందుకునే మార్గాన్ని భగవద్గీత సూచిస్తోంది.

సాంఘిక సమానత్వ స్థాపనకోసం, స్వరాజ్యసాధనకోసం దీక్షవహించిన గాంధీజీకి భగవద్గీతాధ్యయనమే ఆత్మసంయమనాన్ని, మనోబలాన్ని ప్రసాదించినట్లు ఆ మహాత్ముడి ఆత్మకథ నిరూపిస్తోంది.

మానవుణ్ణి పతనావస్థకు దిగజార్చే ఆధార్మిక ప్రవృత్తి సంఘానికి చేటు కలిగిస్తుంది. అందుకే, గుణత్రయవిభాగ యోగంలో అలాంటి ప్రవృత్తిని 'తమోగుణం'గా పేర్కొంటూ, 'అది' పనికిరాదని వివరించాడు. 'తపస్సు'ను కూడా నైతిక పవిత్రతకోసమే గీతాకారుడు నిర్దేశించాడు. పెద్దలను గౌరవించడం, సత్ప్రవర్తన, అహింస, శారీరక తపస్సు అని, ఇతరుల మనస్సును నొప్పించకుండా సత్యము, ప్రియము, హితము అయిన సంభాషణ సాగించడం వాక్కునకు తపస్సు అని, ప్రసన్నమైన అంతఃకరణంతో, సౌమ్య స్వభావంతో కూడిన ఆత్మనిగ్రహమే మానసిక తపసు అనీ శ్రద్ధాత్రయవిభాగ యోగంలో భగవానుడు చెప్పిన మాటల్ని ఈ సందర్భంలో మననం చేసుకోవలసిన అవసరం ఉంది.

ఈవిధంగా భగవద్గీతలో చెప్పిన అంశాలన్నీ సార్వకాలికమైన ధర్మాలే. ఋజుమార్గప్రవర్తక భావ వ్యాపారంతో మానవుణ్ణి సంఘానికి మేలు చేకూర్చే రీతిలో రూపొందించడానికే భగవద్గీత.

కర్మసన్న్యాసయోగంలో 'విద్యావినయసంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని. శుని చైవ శ్వపాకే చ పండితాః సమదర్శినః' అంటూ అన్నిప్రాణులపట్ల సమదర్శనాన్ని ఉద్బోధించాడు. అంటరానితనం ఒక పెద్ద సామాజిక జాడ్యంగా మిగిలిఉన్న ఈనాడు మనకు ఈ గీతాధర్మం శిరోధార్యమే కదా!

'ప్రతి ప్రాణిని నీవలెనే చూడు' అనేది దేశకాల సంఘాలలో నిమిత్తం లేకుండా అందరికీ అన్నివేళలా కావలసిన ఉత్తమోత్తమ ధర్మం కదా! ఆత్మసంయమయోగంలో_

'సర్వభూతస్థమాత్మానం
సర్వభూతాని చాత్మని ।
ఈక్షతే యోగయుక్తాత్మా
సర్వత్ర సమదర్శనః ॥

అంటూ విశ్వమానవప్రేమను ప్రబోధించాడు శ్రీకృష్ణుడు.

సాంఘికమైన అశాంతికి కారణం స్వార్థపరత్వం, సంకుచితత్వం. సమభావం లోపిస్తే, అశాంతి తప్పదు. సమదృష్టి విశ్వశాంతికి మూలం. అహంకార మమకారాలకు అతీతమైన విశ్వమానవప్రేమ మహాచైతన్యస్రవంతిగా మానవాంతరంగాల్లో నుండి పొంగి పొరలితేగాని ఎన్ని శాస్త్రీయవిజ్ఞాన ప్రయోగాలు జరిగినా.

## మిథ్య

— శ్రీ కోదూరి శ్రీధర్

వాస్తవికతలు
అతి వాస్తవికతలు
అందాల చంద్రుని
ఎదలో ఎడారి గోతులు
ఆకాశాన పరుగుపందాన
విజ్ఞానశాస్త్రపు వింతరీతులు
అనురాగ ఝురులకు
ఆనకట్టలు
'దిష్టి' దృక్కోణాలు
కమ్మని రాగాల
కలల అలల
ఉన్నవి సుధలు
చందమామలో
ఉన్నవి మధువులు
వెన్నెల ముద్దలలో
ఊహల్లోనే ఉంది సుఖం
మిథ్యలోనే ఉంది జగం

---

( 12 వ పేజీ తరువాయి )

ఎన్ని రాజకీయవిజయాలను సాధించినా, మరెన్ని సాంఘిక సంస్కరణలను రూపొందించినా శాంతియుత సహజీవనం సాధ్యపడదు.

ఈ సత్యం మానవాళికి హృదయగతమై, ఆచరణలోకి వచ్చినపుడే శాంతి. అందుకు ఏకైకమార్గం గీతాధ్యయనం. అందుకే ఈనాటికీ సమాజంలో భగవద్గీతకు కీలకమైన స్థానం ఉంది. ఏనాటికైనా ఉంటుంది. భగవద్గీతా ధర్మం మరింత వ్యాప్తిచెంది, విశ్వమానవప్రేమ వెల్లివిరిసి, జగమంతా శాంతి నిండాలని, ఆనందం పండాలని మనందరి ఆకాంక్ష. అస్తు.

—...—

### ఋతుషట్కము

## వసంతవాల్లభ్యము

— శ్రీమతి జి. కమలారాఘవన్

శ్రీలన్ పద్మపరాగపంకిల రస
  శ్రీ గంధలంబై తగన్
లీలన్ వాయుతరంగ డోలికల నో
  లిన్ మేళితంబై లస
త్కేళిన్ మత్స్యకిశోరపాళి జెలగన్
  దీప్తిన్ మహోహృద్యమై
బాళిన్ మించు వసంతవేళ చెలువై
  భాసిల్లె కాసారముల్

అళినారిన్ సవరించి సూనశరమ
  త్యంతమ్ము సంధించి సొం
పలరన్ కీరవచో గుణంబు నిగుడన్
  ప్రాబల్య మేపారగా
లలిమీరన్ ప్రణయాత్మలన్ హరిణవా
  రంబున్ వడిన్ హృద్వనా
వళి చెల్లాడుచు వేట సల్పె ప్రియ మొ
  ప్పన్ మారభిల్లుం డిలన్.

తలిరుల జొంపముల్ మెసవి
  ధారుణిరాగ సుధార్ణవంబులో
కులుకగ జేయు మన్ హృదయ
  కోమల వీణల మేళవించున్
సలలితగాన సంపదల
  చక్కగ వీనుల విందు చేయు మన్
విలసిత విక్రమంబునను
  వింత చరింపగసాగె కోకిలల్.

మంజుర సాల పల్లవస
  మగ్రతమాధవికామతల్లికల్
కంజ లతావితానముల
  గాఢపునేస్తములైన కల్వలున్
రంజకమాచు మల్లియల
  రాగముతో పెనవేయు మొల్లలున్
కుంజము లోలి కాన్కలిడె
  కూర్మివనాళి వసంత రాజుకున్.

మకరంద మానుచు మధుకర మిథునంబు
  గానల కందించు కోమలతయు
మల్లెతావులు దెచ్చి మందమారుతములు
  మనముల నలరించు మంచితనము
శుకశారికలు చేయు సుందరకూజిత
  మాధుర్యములలోని మత్తతయును
పుష్పాళ్లనూరియు నొప్పుగాపదనిడ్డ
  మరుసాయకంబుల చురుకుదనము
సంధ్యవేళల గోపాలసమితి త్రోవ
పాడు మురళిపాటలలోని పసదనంబు
స్వాగత పురస్సరముగ వసంతలక్ష్మి
కెలమి తొలివిందు సలిపెను లలితరీతి.

రంగుగనీ వసంతనవ
  రాత్రుల యుత్సవలీలలేమనన్
పొంగుచు హోలిపండుగను
  పొల్పుగ సల్పెడి వైభవంబునన్
మంగళరావముల్ జెలగ
  మన్మథపూజలు సొంపుగుల్క స
త్సంగతిమై రహింప శుభ
  దాయకమయ్యెనుచూడ్కికెంతయున్.

వచ్చె నుగాదియున్ మనకు
  వత్సలతన్ రుచులూరు పంచుచున్
నచ్చిన పిండివంటలును
  నాణ్యములైన వినూత్నవస్త్రముల్
మచ్చిక లూరు గాయలును
  మంజులతన్ తొలిపండు గొచు దా
దెచ్చెను నవ్య భావనలు
  దీప్తి చెలంగగ చుట్టమై తగన్.

—...—

# గాలిబు గీతాల్లో చమత్కారము

—శ్రీ సుంకిరెడ్డి నారాయణరెడ్డి, ఎం. ఏ.



'రమణీయార్థ ప్రతిపాదక శబ్దః కావ్యమ్'
—జగన్నాథుడు

రమణీయార్థమనగా నేఅర్థమును పునః పునః భావించుటచే లోకోత్తరాహ్లాదము కల్గునో అది రమణీయార్థము. ఆ లోకోత్తరాహ్లాదమునకే చమత్కారమనియు నామాంతరము. ఈచమత్కార రత్నములకు గనులు గాలిబు గీతాలు.

ఉర్దూ సాహితీ సరస్వతికి పూలమాలలైయె రసజ్ఞులను కవితారసములో ముంచెత్తిన మహాకవి మిర్జా గాలిబు. నిజాంపై "అగ్నిధార" కురిపించిన ప్రస్తుతపు ఆంధ్రప్రదేశ్ ఆస్థానకవి డా॥ దాశరథిగారు సొంతకవిత్వంలో "గాలిబు గీతాలు" గా అనువాదము చేసినారు. దాని ఆధారముగానే ప్రస్తుత పరిశీలన.

కదలలేని శిల్పంలా కదలని తారలకంటె మెరుస్తూ మాయమయ్యే తారలే అందంగా వుంటాయి. అలాగే భావము స్ఫురించీ స్ఫురించన ట్లున్నపుడే సుందరంగా సంతోష బంధురంగా వుంటుంది. ఇలాగే గాలిబుగీతాల్లో భావము మెరపులా తళుక్కుమంటుంది. తారలా మినుక్కుమంటుంది. అదే చమత్కారం.

"పిన్నతనమున నాకథ వినని ఆమె
యౌవనమున నాకథ లెట్లు లాలకించు?"

"పౌర్ణమినాడు కొంగు బట్టితేరానిది అమావాస్యనాడు కన్నుగిటితే వస్తుందా?" అన్న మన తెలుగు సామెతకు ప్రతిబింబమా అన్నట్లుగా వుంది ఇది. ఇక్కడ తను చిన్నతనంనుండీ ప్రియురాలి కొఱకు పడుతున్న తపన తళుక్కుమంటుంది.

"వత్తు ననిరాక నాగృహద్వారములకు
నన్ను కాపలాగా నిల్పినా వదేమి?"

తన తపనచూసి వస్తానని ఆశపెట్టింది. అందుకే వేచివుండడం. వేచియున్న వారు గృహంలో కాచుకొని వుంటారు. గుమ్మంలో వేచివుండరు. ఇట ద్వారమునకు కాపలా అనడంలో ప్రియురాలిపై వున్న ప్రగాఢమైన వలపు నిగూఢంగా కన్పిస్తుంది.

"శస్త్రవైద్యు కత్తి సైతమ్ము రక్తాశ్రు
కణము లొలికె నీవు కరగ వేమి!"

ఆశ నిరాశ చేసింది. మళ్ళీ అర్థిస్తున్నాడు. కత్తి కన్నీరు కార్చదు కాని కత్తి రక్తాన్ని రోదనగా భావించాడు. ఇదే చమత్కారమంటే. దానిని చూసైనా ప్రియురాలిని కరిగి తనపై కరుణామృతము కురియుమన్నాడు కాని ఆమె కదలలేదు, కరుణించలేదు. నీకన్నా ఆకత్తి నయమని మాటలకత్తుల్ని విసురుతున్నాడు. కత్తివేటు పూరికే పోతుందా కార్యము చేసే తీరుతుంది.

"దొంగతనమైన పిదప నిద్దుర లభించె
నన్ను దోచిన దొంగకు నతు లొనర్తు"

దొంగలు దోచుకున్న వెంటనే నిద్రపట్టడమే వింత. ఇక దొంగకు నతు లొనర్చడ మేమిటి? అక్కడే వుంది తళుక్కుమనే భావన. మాటల కత్తివేటుతో ప్రియురాలు కరుణించి తనహృదయాన్ని కాజేసింది. ఎన్నాళ్ళుగానో అనుకున్నది నేడు నెఱవేరింది. అందుకే నిద్రపట్టింది. కలలో ప్రియురాలికి నతు లొనర్చినాడు.

"మునుపు పూదోటలన్నచో మురిసిపోతి
పూల వాసన కూపిరి పోవు నేడు."

సంతోషంగా వుంటేకదా హృదయం వుత్సాహంతో వురకలు వేయడానికి పూదోటల విహారాలు కోరడానికి. విరహంలో వున్న వారికి పూలవాసన మరింత విరహబాధను కల్గిస్తుంది. మన ప్రబంధ కవులుగూడ నాయికలచేత వెన్నెలను పూలను తిట్టించారు. అదే ఇక్కడా కన్పిస్తుంది. ఇక్కడ తనకు ప్రియురాలు దూరముగా వున్న దన్న విషయాన్ని ధ్వనింప జేస్తున్నాడు.

"ఇంత దుఃఖమ్ము నైప నాకేక హృదయ
మేల ఒక పది ఇయ్యవై తేమి దేవ"

హృదయంభరించరానంత దుఃఖమున్నపుడే ఆత్మహత్యలు జరిగేవి. కాని ఇతడు ఆత్మహత్య చేసికో బూనటం లేదు. తను మిక్కిలి దుఃఖాన్ని భరించడానికి హృదయాలు పది కోరుతున్నాడు. పది హృదయాలతో బాధ పడటానికి గూడ సిద్ధమే కాని పిరికివాడిలా ఆత్మహత్య చేసికోడు. దీనివెనుక అతని నిబ్బరము, ప్రియురాలిపై గల ప్రగాఢ ప్రేమ చమత్కారంగా వ్యక్తమవుతాయి.

"దుఃఖవిషము నాప్రాణాలుతోడివేసె
నీవు నను చంపితివటంచు నిందయేల"

ప్రియురాలివలని దుఃఖము తన ప్రాణాలు తోడివేసినా ప్రియురాలిపై నెపము వేయుటకు వెనుకాడుతున్నాడు. ప్రాణాలు పోయే సమయం వచ్చినా ప్రియురాలిపై ప్రేమ చావలేదు. అతనిదెంత అమరప్రేమో ఇక్కడ వక్రంగా వ్యక్తమవుతుంది. అందుకే 'వక్రోక్తిః కావ్య జీవితమ్' అన్నారు.

—...—




# మరో ప్రపంచం కోసం

- రత్నశ్రీ (యస్. రాజశేఖర్, బి. ఏ.)

'మరోప్రపంచం కోసం'. కవితా సంపుటి. రచయిత : శ్రీ రాధేయ (సాహిత్యవిశారద V. N. సుబ్బన్న.) ధర : 4 రూపాయిలు (Friendly subscription.) పుటలు : 50.

ప్రతులకు : 1. ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్ రాష్ట్రపతిరోడ్, సికింద్రాబాద్-3. విశాలాంధ్రా పబ్లిషింగ్ హౌస్, విజయవాడ.

ఆధునిక కవితాసంపుటాలు పుంఖానుపుంఖాలుగా వెలువడుతున్న ఈ రోజుల్లో, అభ్యుదయ కవితా రథసారథి శ్రీ రాధేయగారి 'మరోప్రపంచం' కోసం కవితాసంపుటి ఒక ప్రత్యేకతను సంతరించుకున్న వినూత్న సృష్టి. శ్రీరాధేయగార్ని ఆంధ్ర సాహితీలోకానికి,కొత్తగా పరిచయం చేయవల్సిన అవసరంలేదు. వారి కవితలు ప్రముఖపత్రికల్లో ప్రచురింపబడి, ప్రముఖుల ప్రశంస లందుకున్నాయి. ఆ, కవితలన్నీ ఒక పుస్తక రూపంలో రావా లని చాలామంది పాఠకులూ, రాధేయమిత్రులూ కోరుకోవటం, దానికి తగిన సహకారం అందటంవల్ల సంస్కృతి సమాఖ్యవారు అందంగా, హుందాగా ముద్రించి మనముం దుంచారు. రాధేయగారి కవిత్వంలో నూతనత్వం చేతనత్వం పుష్కలంగా ఉన్నాయి. ఆయన కవిత్వం ఒక ప్రాంతానికి, ఒక సమాజానికీ పరిమితం కాకుండా, విస్తృతంగా వ్యాపించి యావత్ ప్రపంచాన్ని ప్రతిబింబించింది. మానవజాతికి కనువిప్పు కల్గించే పుస్తకం ఇది. కవితలు నడిపించిన తీరు ప్రశంసనీయం. ఉపయోగించిన పద జాలంఅమోఘం. 'మరోప్రపంచంకోసం' వారికృషి అద్వితీయం. కండగలవారి కవిత్వం ప్రతిఖండికలోనూ సాక్షాత్కరిస్తుంది. శ్రీరాధేయగార్కి మంచి భావనాపటిమ, భాషావైదుష్యం, ఉన్నాయి. వారి కవిత్వంలో ఒక ఒడుపు, ఊపు ఉన్నాయి. మళ్ళీ మళ్ళీ చదివించే గుణం వారి కవితల కధికంగా ఉంది. దానికికారణం ఆ కవితలన్నీ 'సామాజిక స్పృహ' ఉన్న వివాస్తవానికి దర్పణాలు. తూటాల్లాంటి మాటలతో చెప్పదల్చుకున్న విషయాన్ని సూటిగా, నీటుగా, బాహాటంగా చెప్తారు. వస్తువైవిధ్యం, భాషావైదగ్ధ్యం ఉన్నాయి. డా. సి. నారాయణరెడ్డి, ఆవంత్స సోమసుందర్, మానేపల్లి సత్యనారాయణ గార్లు ముందు మాట (ఆముఖము)లు వ్రాయగా భూతపురి సుబ్రహ్మణ్య శర్మ, నైషధం వేదాద్రయ్య, వి. శిరీష్ కుమార్, జి. వి. యల్. నారాయణరావు గారలు అమూల్యమైన అభిప్రాయాల్ని అందించి, ఈపుస్తకానికే ఒక వన్నె తెచ్చారు. ముఖపత్రాన్ని శ్రీ మోహన్ గారు సర్వాంగ సుందరంగా భావస్ఫోరకంగా చిత్రించారు.

ఈ సంపుటిలో ఉన్న ప్రతి కవితా ఆలోచన రేకెత్తిస్తుంది. పాఠకుణ్ణి చైతన్యవంతుణ్ణి చేస్తుంది. ఒక్కమాటలో చెప్పాలంటే, ఈ మధ్యకాలంలో వచ్చిన అభ్యుదయ కవితా సంపుటాల్లో కొత్తదనాన్ని సంతరించుకున్న ఉత్తమ కవితా సంపుటి ఇది. ప్రతి కవితలోను కవి మనకు దర్శన మిస్తాడు. మన ముందు నిలిచి, మనతో మాట్లాడుతున్నట్లు అనుభూతి కల్గిస్తాడు. నన్ను ఎంతగానో ఆకర్షించి, కదిలించిన పుస్తకం ఇది. స్తవం కాదు. ఇది వాస్తవం. ముఖస్తుతికాదు నిజస్థితి. ఈ కవితాసంపుటి రాయడంలో రాధేయగారి ఉద్దేశం ప్రజల్ని చైతన్యవంతుల్ని చేయడం. ఈ సంపుటిలో మీకు పతితులు, భ్రష్టులు, దీనులు, హీనులు కన్పిస్తారు కాని అందాల సుందరాంగులు, వారి అంగాంగ వర్ణన, కల్లబొల్లికబుర్లు, అర్థంలేని వ్యర్థమైన వర్ణనలు, అలంకారాలు, కాకమ్మ కథలు కనిపించవు. ఈసంపుటిలో మీకు ప్రస్ఫుటంగా ప్రత్యేకంగా కనిపించేది వాస్తవ జీవితచిత్రణ, కొన్ని సమస్యలకు పరిష్కారం. శ్రామికులకు, దేశంకోసం పాటుపడే వ్యక్తులకు అందులో ప్రముఖ స్థానం ఉంది. అశ్లీలంగాని, అసభ్యం గాని లేని కవిత్వం ఇది. నిజమైనకవిత్వం ఇది. ఏ ఇజానికీ కట్టుబడి వ్రాసినది కాదు. ప్రజాకవిత్వం ఇది. అసలైన అభ్యుదయ కవిత్వం ఇది.

నలభై ఎనిమిది పుటల్లో ముప్పయి రెండు కవిత లున్న సంపుటి ఇది. ప్రతి కవితా ఒక ఉత్తమకళాఖండం. ఈకవి అభ్యుదయవాది, ఉల్లాసంగా వ్రాసిన కవిత్వం కా దిది. ఉద్రేకంతోను, ఉద్వేగంతోను 'మరోప్రపంచం కోసం' నిర్మించిన గట్టికట్టడము ఇది. కేవలం ఆవేశం, నినాదాలేకాదు. ఆ,ఆవేశానికి ఒక వేషం వేసి, ఆ నినాదాలకు ఒక నాదం కూర్చి ఆవేదనకు అక్షర రూపం ఇచ్చారు. అందుకే ఆ కవితలు అంతరమణీయాలు అందుకే అవి సంస్మరణీయాలు. కుళ్ళు సమాజాన్ని కూకటివేళ్ళతో పెకలించాలని తహతహ. సమాజాన్నిమార్చాలని కవిపడే తపన, మథన కన్పిస్తాయి. ప్రతి కవితలోనూ వేడినిట్టూర్పులు విన్పిస్తాయి

ఇది రాధేయగారి తొలి ప్రయత్నమే అయినా అభినందనీయం, ప్రశంసనీయం. ఈ కవితలను అందంగా పుస్తక రూపంలో మనముందుంచిన 'సంస్కృతి సమాఖ్య' (యువసాహితీ వికాసవేదిక) వారి కృషి శ్లాఘ్యం. ఒక ఉత్తమ కవిని ప్రోత్సహించి, కవితలన్నీ ప్రచురించినందుకు వారికి నాసాహితీవందనాలు.

శ్రీ రాధేయ 'ప్రజాహిత చింతనను తన కలంకదిపే ప్రతి అక్షరంలో పొందికగా అమర్చాడు. సమాజాన్ని కవితల్లో అందంగా ఫోటో తీయడంలో సిద్ధహస్తుడీయన. ఫోటోనేకాదు, అవసరమైతే ఎక్స్‌రేకూడ తీయడానికి వెనుకాడడు. ఈసంపుటిలోవున్న చాలాకవితలు ఎన్నో ప్రముఖ పత్రికల్లో అచ్చు అయ్యాయి. సామాజిక విప్లవం. సమసమాజ నిర్మాణం ఆశించేవారి కిది ఒక కానుక. అభ్యుదయ కవిత్వానికి ఒక మచ్చుతునక. ఇది నవోదయానికి నాంది.

శ్రీరాధేయగారు మొదటి కవితలోనే తన ఆశయం, లక్ష్యం చెప్పారు. ఆయనకు అంతర్జాతీయ కవితాస్పందన వుంది. ఆయన కవిత్వం 'కదిలేది కదిలించేది, మారేది మార్పించేది, పాడేది పాడించేదీ, పెనునిద్దుర వదిలించేదీ మునుముందుకు సాగించేది.' ఉదయించే తూర్పులాగ, ప్రభవించే మార్పుకోసం, ప్రసరించే ఉషస్సుకోసం, ఈయుగం ప్రసవించే విప్లవశిశువుకోసం, శ్రీరాధేయ కలం పట్టారు. సమాజసమస్యల పరిష్కారం కోసం అన్వేషించడం ఆయన ఆశయం; వాస్తవాల్ని నిర్భయంగా, నిర్మొహమాటంగా, నిస్సందేహంగా ఘాటుగా చాటి చెప్పడం ఆయన ఉద్దేశం. వర్గచైతన్యాన్ని, వాస్తవికదృక్పథాన్ని, భావ విప్లవాన్ని కల్గించడమే మహత్తరలక్ష్యంగా, నిస్తేజమైన జడ సమాజంలో చైతన్య దీప్తిని ఉద్దీపింపజేయుటే ఈయన ఆశయం. ఈ అస్తవ్యస్త వ్యవస్థను మార్చేందుకు అందరూ ముందుకు రావాలని ప్రబోధించారు. ఇది వచన కవిత్వంకాదు. ప్రవచన కవిత్వం. ఇతి వృత్తంలో, నిర్మాణ సౌష్ఠవంలో విలక్షణమైన వినూత్నసృష్టి. ఇది చైతన్య లహరి. ప్రగతి శీల భావాల ఝరి. ఇదొక అపూర్వ సృష్టి, అమృత వృష్టి.'

'శ్రీ రాధేయ మంచి అభ్యుదయ భావాలున్న మంచికవి' అని ఈ పుస్తకం చదివిన అందరికీ అనిపిస్తుంది. ఈయన్ని ఇంకా ప్రోత్సహించి మరిన్ని 'ఉత్తమ కవితా సంపుటాలు' రచించేందుకు, రసజ్ఞులు ఆశీర్వదించి, చేయూత అందించాలి. అందరికీ అర్థమయ్యేరీతిలో రచించబడింది. ఆలోచింపచేసి, కర్తవ్యం ప్రబోధిస్తుంది ఈ సంపుటి. అక్కడక్కడ అచ్చు తప్పులున్నా వాటిని మినహాయిస్తే పుస్తకం ఆపాదమస్తకం (ఆద్యంతం) రసప్లావితంగా, భావస్ఫోరకంగా ఉంది. రాధేయ గురించి రెండుముక్కల్లో చెప్పాలంటే

'మంచి రచన చేయ
అందె వేసిన చేయి
శ్రీ రాధేయ.'

—...—

# విశ్వేశ్వర శతకము

– శ్రీ ప్రసాద్.

(రచయిత– ముక్కపాటి శ్రీరామ శాస్త్రి ఎ.వి.ఎ.సి; కాశీవిశ్వేశ్వర స్వామి వారి దేవస్థానం. తీగలవంచ నరసాపురం. చింతలపూడి తాలూకా ప. గో. జిల్లా. వెల తెలియదు. )

వాఙ్మయవృక్షశాఖలలో మిక్కిలిగా కొనసాగినది శతకశాఖ. అందు దైవస్తుతి పరములగు శతకముల విభాగము మరింత మితిమీరినది. కవితారంభమున దైవస్తుతి రూపకమగు రచన ప్రాథమిక యను నానుడి సత్యముకావచ్చును. ఇట్లు వచ్చినవానిలో విశ్వేశ్వరశతక మొకటి.

రచయిత శ్రీ ముక్కపాటి శ్రీరామ శాస్త్రిగారు. ప్రకాశకులు శ్రీ కాశీవిశ్వేశ్వరస్వామివారి దేవస్థానము వారు. తీగలవంచనరసాపురము.

ఇది పూర్వార్ధశతకము. ఉత్తరార్ధశతకము నని రెండుభాగములుగా నున్నది. ఇందు కాశీమహిమ, స్థలనిరూపణం, ప్రతిష్ఠ– పరిపాలన, నిత్యసవనం, ఆపద్విభాగంమున్నగు విభాగములు పదునేను కలవు. ఇట్టి విభాగము భర్తృహరి శతకత్రయమున గావించిన 'పద్ధతి' ననుసరించియుండవచ్చును. కాని యీవిభాగముల లోని పద్యసంఖ్య నియతమై లేదు. పద్యముల ధారా శుద్ధి నిరాతంకముగా నున్నది. శయ్యాసౌభాగ్యము సుందరము. 'ఆశల్ తీరవు మానవాళి కిల' వంటి పద్యము లనేకములు. పదవిన్యాసాదికము రచయితకు గల భాషాపరిచయమును, వైద్యవిజ్ఞానమును సూచించును.

'హేపార్వతీనాథ' పాహి మాం పశుపతే వంటి ప్రయోగము లిందుగలవు. 'తథ్యము' వంటి విచిత్రములు కలవు. ముద్రారాక్షసములు గావచ్చును. వానిని పరిహరించుట కష్టముకదా! 31 పద్యములోని 'భవద్భస్మంబునన్' అనుకోని దురర్థమును సూచించుచున్నది. 36 లోని 'మహాఘర్గమ్య' విచారణీయము. 40 ప. లోని 'మహిమ్న నామక' లోని క్రీగీటు పదము సమాసమున విచారణీయము. 41 పద్యము భావము విచారణీయము. అందు 'నేనాప్తుండనై కొల్తు' ఇంతకు పూర్వము 'అలకాపట్టణ' విన్యాసమునకు పైదానికి సంబంధమేమియో? వివరణ యున్నచో బాగుండెడిది. 46 లోనిదీర్ఘ సమాసము మిగిలినదానితో నెట్టి యర్థముతో నెట్లన్వయించునో దురవగాహము. ఉత్తరార్థములోని 'బంధన్' పదప్రయోగము విచారణీయము. ఉత్తరార్థము 5 వ పద్యములోని శివసంబోధనయగు 'సంభావ్యాఖిల లోకపాలకగణా!' యనుదాని వలన, శివున కపకర్ష కలుగుచున్నదికదా!

# రాళ్ళపల్లి పీఠికలు - ఒక సమీక్ష

- డా. జి. యస్. మోహన్, ఎం.ఏ పిహెచ్.డి.

[రాళ్ళపల్లి పీఠికలు_వెల. రూ 15/- సంపాదకులు: శ్రీఘట్టమరాజు అశ్వత్థ నారాయణ, డా. ఆల్వియస్, సుందరం. ప్రకాశకులు: రాళ్ళపల్లి అభినందనసమితి, 53, II బ్లాకు. త్యాగరాజనగరు, బెంగుళూరు - 28]

'రాళ్ళపల్లిపీఠికార్చన వ్రాస్తూ డా.జి. ఎన్. రెడ్డిగారు 'గ్రంథపరిష్కరణ విద్యను అంటిపెట్టుకొని ప్రచారానికి వచ్చిన ఒకానొక సాహిత్యవ్యాసంగం పీఠికారచన. అది రానురాను తెలుగు రచయితల గద్యపద్య నాటకాది వివిధగ్రంథాలలో ఒకభాగంగాను అలంకారంగాను అభివృద్ధిపొంది ఈనాడు ఒక సాహిత్యాంగంగా పరిణమించింది పీఠికారచన ఒకకళగా భావించి వైయక్తికమైన ముద్రతో విలక్షణమైన ఫక్కీలో పీఠికలు వ్రాయనేర్చినవారు మన కెందరో లేరు. ఉన్నవారిలో అగ్రస్థానం రాళ్ళపల్లివారిదే' అని నుడివియున్నారు. ఈ మాటల్లో అతిశయోక్తి ఇసుమంతైనా లేదు.

సొంతంగా రచనచేయడం ఒక ఎత్తు. ఇతరుల రచనలకు పీఠికలు వ్రాయడం మరోఎత్తు, పీఠిక వ్రాయడం కేవలం తద్రచయితను అభినందించడం కోసం కానీ, ఆయన కృషిని ప్రశంసించడం కోసం కానీకాదు. అయితే నేడిదే ప్రచారంలో ఉందనుకోండి. అవిషయం వేరు. పీఠికను రచించడం కత్తిమీది సాము లాంటిది. రచయితలోని లోపాల్ని వ్రేలెత్తి చూపితే ఆగ్రచయితకు కోపం. ఉన్న లోపాల్ని చెప్పకపోతే పాఠకులకు ఆగ్రహం. ముందుచూస్తే నుయ్యి, వెనక్కిపోతే గొయ్యి; అన్నట్లుంటుంది పీఠికారచయితకు. కాని రాళ్ళపల్లివిషయం వేరు. లోపాన్ని లోపంగానే చెప్పడం, ఇలాచేస్తే బాగుంటుందని సూచనలివ్వడం ఇత్యాదుల్ని వీరొక్కరే చేయగలరు. ఇదే వీరిలో ఉన్న విశిష్టలక్షణం. ముఖస్తుతి చేస్తూ వ్రాయడం వారికి చేతకానిపని, ఉన్నదున్నట్లుగా, సూటిగా హృదయానికి హత్తుకొనేలా చెప్పడంలో వారికి వారేసాటి. వచనరచనలో ధురీణులైన రాళ్ళపల్లివారు పీఠికలు వ్రాయడంలో సిద్ధహస్తులు. వారి రచనలో సౌకుమార్యం అడుగడుగునా కన్పిస్తుంది.

రాళ్ళపల్లివారి పీఠికలు 1 స్వీయరచనలకు- పరిష్కృత గ్రంథాలకువ్రాసినట్టివి 2. ఇతరులరచనలకు వ్రాసిపెట్టినట్టివి. అని ఆచార్య జి. ఎన్. రెడ్డిగారు తమ 'పీఠికార్చన'లోనే సెలవిచ్చినారు. వారే అన్నట్లు ఇవి ఏరకానికి చెందినవైనా విషయ ప్రాధాన్యంతో కూడుకొన్నట్టివి. 'రాళ్ళపల్లిపీఠికలు' కు చక్కని పీఠికార్చన సమకూర్చడం ఈ గ్రంథానికి గల మరో విశిష్టత నిజానికి ఇది పీఠికార్చనకాదు. పీఠికార్చనలోని భావాలు ఈగ్రంధానికి సమీక్షారేఖల్లాంటివి.

రాళ్ళపల్లి వారువ్రాసిన పీఠికలు 1. ప్రాచీనకవిత్వం 2. ఆధునిక కవిత్వం 3. నాటకాలు 4. నవలలు - కథలు 5. వ్యాసములు- విమర్శలు - పరిశోధనములు 6. ఇతరములు అని విభజింపబడ్డాయి. ఇలాచేసినందువల్ల విషయవిశ్లేషణ బాగా జరిగింది.

> చెప్పబోవుదానిఁ జప్పిమాటలచేతఁ
> జెప్పవచ్చుఁ; దాన మెప్పులేదు
> చెప్పవలయు రసము చిప్పిల నీయట్లు
> కీర్తనీయ చరిత! కృష్ణశర్మ!
>
> -డా. చిలుకూరి నారాయణరావు

ఈ మాటలు సత్యదూరంకావు, వచనరచనాశైలిలోనే భావం, ఆభావాన్ని రసదృష్టితో పోషించి పాఠకులను మెప్పించడం శ్రీమాన్ రాళ్ళపల్లి వారికి వెన్నతో పెట్టిన విద్య. పాఠకులు చదువుతున్నంతసేపు విసుగు పొందడం కానీ, ఏమిటి! పనికిరాని మాటలు నాలుగు వ్రాసాడే! అని అనుకోవడం గానీ జరుగకుండా, ఇంకా ఎన్నివిశేషాలువ్రాస్తాడో చదవాలి అన్నకుతూహలాన్ని రేకెత్తించే వచనరచనా శిల్పం శ్రీమాన్ రాళ్ళపల్లివారిది. వారు పీఠికల్లో ఏమాట వ్రాసినా తూచి తూచి వేసే నైపుణ్యం వారిది.

రాళ్ళపల్లివారు వ్రాసే పీఠికల్లో రచయిత ప్రాధాన్యంకంటే వస్తు ప్రాధా

---

( 16 వ పేజీ తరువాయి )

(ఉత్తరార్థమువ) 21 వ పద్యములోని యర్థౌచిత్యము దురవగాహము, విచారణీయము. ఇట్లే 44వ పద్యము 'కాముం గాల్చిన ఫాలలోచనుడవై కామించి వెన్నాడి తద్భామంగూడి రమింపగోరితివి' ఇత్యాదిపద్యార్థము విచారణీయము. వివరణ నిచ్చిన బాగుండెడిది. ఇట్లే 45 లోని 'చక్రవర్తాలంకారశరీర' దీని యర్థము విచారణీయము. వివరణసాపేక్షము.

ఇట్టి వింకను నిందు కలవు. మొత్తము మీద భావనాశుద్ధి ధారానిర్వహణ, శయ్యాదికము, ప్రశంసనీయములు. ఇట్టి రచనా సామగ్రికల వీరు మరింత భాషాదిక సంపత్తిని సమకూర్చుకొని దైవగాథలు రచించినచో బాగుండుననిపించును. వీరి కవితావిలాసము ప్రశంస్యము కాక మరే మగును ? వీరికి గల దైవభక్తి, రచనావిధానము ప్రశంసనీయములు వీరింకను మనోహర శైలిలో సుందరతరరీతిలో మరిన్ని కావ్యములు రచించి పాఠకలోకము నానందింప జేయగలరని యనుకొనవచ్చును. దీనిపై శ్రీవిశ్వనాథ 'వంటి మహానుభావుల యభిప్రాయములు కలవు. పుస్తకము వెనుక రచయితకు చెందినవి శేషముల వివరణ యున్నది.

న్యమే అధికంగా ఉంటుంది. గ్రంథంలోని రచయిత అభిప్రాయాలకంటే ఒక్కొక్కమారు వీరి పీఠికలోని అభిప్రాయం మిక్కిలి ఉపయోగకారిగా ఉంటుంది.

ఇక వారిపీఠికల్లోని కొన్ని అభిప్రాయాలను మీముందుంచుతున్నాను.

ఆరుద్రగారి 'సమగ్రాంధ్ర సాహిత్యానికి (సంపుటము 8) పీఠికవ్రాస్తూ కొన్ని సూచనల్ని కూడా ఇచ్చారు. 'కొన్ని వ్యాప్తిలో ఉన్న అభిప్రాయాలను తరచి చూడకుండా ఆరుద్రగారు ఇందులో చేర్చియున్నారు. కొన్నిటిని పేర్కొంటాను' అంటూ పంద్రెండింటిని సూచించారు. ఇట్లాంటి 'ధోరణి' అభిప్రాయాలు మరికొన్ని ఎత్తిచూపవచ్చును... ఇది కుదృష్టిచేతనో, అసూయచేతనో చేసిన కొతక్కూత విమర్శకాదు. ఇట్లాంటి మహాకార్యం తేజస్విగా వెలయవలెనని చేసిన సూచన" (పుటలు 314-317)

శ్రీ వేలూరి ఆనందమూర్తిగారి 'తాళ్ళపాక కవుల పదకవితలు-భాషాప్రయోగ విశేషాలు' (భాగము 2) అన్న గ్రంథానికి పీఠికవ్రాస్తూ శ్రీమాన్ రాళ్ళపల్లి వారు 'అనేక విషయాలను సవిస్తరముగా విమర్శించి వివరించిన యిటువంటి గ్రంథమును చదువుకొనేటప్పుడు అందందు కొన్ని భిన్నాభిప్రాయాలు తోచేది సహజం. నాకు స్ఫురించిన అట్టివిఅనుక్రమంగా ఇక్కడ కొన్ని సూచిస్తాను. అది భావి విమర్శలకు ఏమైనా ఉపకరింప గలిగితే తృప్తిపడగలను' అంటూ పదునైదింటిని తడవియున్నారు. (పుటలు 340-346)

సంగీత సాహిత్యోపాసకులు శ్రీమాన్ రాళ్ళపల్లి వారు. డా. సి నారాయణరెడ్డి గారి 'నాగార్జున సాగరం' కు మంగళాసనము వ్రాస్తూ పాట నిట్లు నిర్వచించియుండుట వారి సంగీతాభిరుచిని చెప్పక చెప్పుచున్నది. 'నాదనియమము రాగము, కాలనియమము తాళము. ఈ రెంటిలో లయించి పనిచేయుట పాట' (పుట160)

డా. పల్లాదుర్గయ్యగారి 'గంగిరెద్దు' కు పీఠిక వ్రాస్తూ అందులోని లోటుపాట్లను కొన్నింటిని చర్చించినారు. ఇట్లెత్తి చూపిన లోపములు, సూచనలు ఆ రచయితకే కాక భావిరచయితలకు పాఠకులకును, కళ్ళు తెరపించినవిగా ఉన్నాయి. 'అందందు నీతిబోధ చేయునప్పుడింక కొంత యెక్కువగా సంయమము చూపి యుండినచో ఈకావ్యమందలిచిక్కదన మింకను హృద్యముగా ఉండియుండెడిది. అట్లే కథారచనలో చాకరకపు నవలలు వ్రాయువారివలె, ముందు తానే చెప్పబోవు విషయములు, తనకేమియు తెలియనట్లు కవి నటించుట ఇందొకటి రెండుచోట్ల కానవచ్చెడిని. ఈ గంభీరకావ్యములో ఆ చక్కందాలు అగ్గువసరుకులై యున్నవి. శాక్కరము, ఇట్చరము మొదలగు పదములు ప్రయోగించుట కూడ కవిగారు వదలియుండిన మేలయ్యెడిది. సంస్కృతభాష లోనే యెన్నడో యెక్కుడనో కన్నులు మూసుకొన్న శబ్దాలివి. వాని రెప్పలు బలవంతముగా తెరచి ఫలము లేదు' (పుట 175)

శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారి 'ఆంధ్రుల సాంఘిక చరిత్ర' పై తమ అభిప్రాయాన్ని వెలిబుచ్చుచూ కొన్ని సూచనలు (22) కూడా ఇచ్చారు. అవి సూచనలే యని విమర్శకాదని సవినయముగా విన్నవించుకొని వారి అభిప్రాయములను మొహమాటము లేక వెల్లడించారు.

(పుటలు 294-299)

ఇలా వారి పీఠికల్లో, అభిప్రాయాల్లో డా. జి. యస్. రెడ్డి గారన్నట్లు 'ఎవరో ఒకరచయిత కోరికను మన్నించి మర్యాదకో మొహమాటానికో నాల్గుమాటల్లో తన అభిప్రాయాల్ని వ్రాసినా అందులోనూ ఒక మెలకువో, ఒక మురిపెమో, ఒక చిన్న మెరుపో ప్రతిబింబితమై వుంటుంది. పెద్దపీఠికల్లో విషయౌన్నత్యం, అభిప్రాయ గాంభీర్యం, పటుత్వం, తప్పని సరివాక్కు, శైలీ సంపన్నత ప్రధాన లక్షణాలు' (పీఠికార్చన). అంతేకాకుండా వారి పీఠికల్లో కన్పించే మరొక ప్రధాన విషయం వారి బహువిషయ పరిజ్ఞానం.

ఇకపోతే రాళ్ళపల్లి వారి పీఠికల్ని ఏర్చికూర్చి తెలుగువాళ్ళకందించిన ఆంధ్ర సాహిత్యారాధకులు శ్రీ ఘట్టమరాజు అశ్వత్థనారాయణ, డా. అర్గీస్ సుందరం గార్ల కృషి అభినందనీయమైనది. ఇది ఆంధ్రులకు వారి రెండవ కానుక. మొదటిది 'అనంతరంగం' సాహిత్యాభిమానులకు అనంతమైన అనురాగాన్ని అందించిన ఈ సంపాదకులు (అనంతరాగానికి మరొక సంపాదకుడు శ్రీ శివలెంక శ్రీ రామచంద్రమూర్తి) తమ రెండవ ప్రయత్నంగా రాళ్ళపల్లివారి పీఠికల్ని పుస్తకరూపంగా అందించి, మరోసారి తమ సమర్థతను, సాహిత్య సవ్యసాచులు, వయోవృద్ధులు అయిన శ్రీమాన్ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ గారిపై తమ గౌరవాదరాభిమానాలను నిరూపించుకొని ఆంధ్రలోకమునకు సుపరిచితులైనారు. వారికివే హార్దిక ధన్యవాదాలు.

— ... —

# తెలుఁగువారి గాదిలి 'ఉగాది'

--- శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి.

పలపలఁ దూర్పుకొండఁ దల
వాలెడి సందడిలో నుగాదిగా
దిలి చెలి ప్రోది చేసిన స్మృ
తిప్రతతుల్ కవితాకళానుభూ
తులు మధుపర్క మాధురుల
తోఁ గల కంఠము లెత్తఁగాఁ దెనుం
గుల తొలిపెంపు కన్గొలఁకు
కోనల నింపుఁ దటిత్తిటాకమున్.

తేనియగుండెలన్ నిరవ
ధిస్పృహలన్ నవచైత్రసౌధ సో
పానము లెక్కుచున్న యువ
భావములన్ బుపుదూళిరేఁగఁ; బ్రా
జ్ఞానిలముల్ కలంచు శశి
రాత్రి నిశీథపువేళ లేచి కే
లూనికలేమి డిల్లపడు
చున్నవి కాలజరత్పత్రముల్.

తలఁపులపన్ శకుంత విరు
తమ్ములు మేల్కొలుపుల్ వెలార్చె కో
మలతర గీతముల్ నొడివె.
మాసిన వల్వలు తీసివైచి క్రొ
త్తలు ధరయించు కోరిక లె
దన్ నన లొత్తెను; బాంధుమ్ముల్లె తీఁ
గల ముదురాకు దూసిన వ
గన్ ముకుళోత్కరముల్ ధ్వనించెడిన్.

అమృత యశోమహాస్సురభి
శొత్తులు గాంచి వసంతకాల చ
క్రమున నిలింపల క్రమధు
రామతి బంగరుటాకులైన తె
న్గుమగల యమ్మగంటిమి మ
నోజ్ఞము నేఁటి స్మృతిప్రవాహఘు
ర్ణములఁ దొలంకు పాలకెర
టమ్ములపైఁ గవిరాణ్మరాళముల్.

బోధ శ్రీముఖ శాలివాహన శకం
బుల్, హాలలీలావతీ
గాథాహేలలు, శ్రీగుణాఢ్యకృతి శి
క్షారత్నలున్, గౌతమీ
మాధుర్యావధి శాతకర్ణికృత ధ
ర్మక్రాంతులున్, దద్గుణో
ద్బోధస్వాదువులౌ సహస్రములు గా
దుల్ నేఁడు సిద్ధార్థముల్.

శాలంకాయన విష్ణుకుండిన జయా
శ్వాసంబు, లిక్ష్వాకు గా
థాలాభార్థములున్, జళుక్యపతి స
త్కారంబులున్, భారత
ప్రాలేయాంశు మహోదయంబులు తన
ర్పన్ గాలయుక్తిన్ శర
న్మాలా ప్రత్న మణిప్రరోహములనా
త్న శ్రీలు సిద్ధార్థికిన్.

ఏకశిలాదుర్గ హేలావతీ ఫాల
మునఁ గమ్మకస్తురి బొట్టు దిద్ది
యుపక ప్రజాళంఖ ముత్తిన 'ముసునూరి'
యామ్మన వీరగంధమ్ము రాసి
అల పాకనాటి ప్రోలయవేమ శిరమున
హరివంశజములు ముత్యములు పోసి
లస హాభినయ కళాలలితుఁడైన కుమార
గిరికి వసంతముల్ గీలుకొలిపి
'తెనుఁగుకవి పల్లకీ' యెత్తుకొనిన బుజము
కలుఁపుకొని వేలకొలఁది గాదిలి యుగాది
పైదలులు పట్టుచున్న కర్పపునివాళి
వెలుఁగులో నేఁటి సిద్ధార్థినిలువుతోఁచు.

యుగ యుగములఁ దరతరముల
నుగాదికలయికల నవమహోత్సవములలోఁ
బగలు విడిచి దిగులు మఱచి
జగా తెనుఁగు బ్రతుకులను
రసజ్ఞుఁడు వలచున్.

# కాకీ!

శ్రీ చింతలపూడి వెంకటేశ్వర్లు, ఎం.ఏ.

కాకీ! కాకీ!
ఏంటీవేళ 'కాకా' జోరుచేసావ్!
నీకూకావాలా ఒక గండపెండేరం!?
గజ్జలుకట్టించుకు గంతువెయ్యడం నీ
కలవాటే కదా! కాకీ
దాన్దేముందిలే మనలో మాట ..
(ఎక్కడేనాడో తీసిపారేసిన
గిల్టురింగు పట్రా కాకీ
మెరుగుపెట్టించి పదిమందిలో నీ
కాలికి తొడిగేస్తా మో కాకీ.)
హంసలు పికములు అవీఅంటూ
సందేహించకు ఎంతమాత్రమూ
అవెక్కడున్నాయో ఏమో కానీ
ఎక్కడా కనిపించటంలా.
ఒకవేళెక్కడనేనా ఉన్నా
బరిమీద కొచ్చేటంత ధైర్యం
లేదులే వాటికి.
క్షైబ్యంలోపడి కొట్టుకుంటున్నాయి.
వైద్యం చేయించే నాథుడూ లేడువాటికి
ఏదేమైనా
అదీయిదీ వింటూ
మాయింటతిరిగే దానివినువ్వు.
పనున్నా లేకపోయినా
వచ్చి పొద్దున్నే నిద్రలేపుతావు
నీతృప్తికోసం
ఆమాత్రం చేయలేమా.
ఆర్నీ ......
మాటన్నానోలేదో
ఎంతమురిసిపోతున్నావ్.
మహామహా 'కవి' అనేపేరు
నీకేచెల్లిందిసుమా! కాకీ

## కాలయుక్తి - సిద్ధార్థి

శ్రీ మ. సుబ్రహ్మణ్యశర్మ.

అసలు పాదపచ్యుత ఫ
   లావళులై అజకాలయుక్తియై
చేసెడి వానినే మరల
   చేసెడి రీతిగ కాలయుక్తికిన్
దాసిగనై, ప్రయోజనము
   దక్కక, దర్శితకాలయుక్తియై
ఆసకలేశ్వరుందలంచు
   నాత్మను దోచె విశిష్ట భావనల్.

గడచెనట కాల యుక్తిక
అడుగిడె సిద్ధార్థియంట యగునో కాదో
ఎడదం గల్గిన కోరిక
లడరగ సిద్ధార్థి శుభము నందిచ్చు సదా.

శిశిరద్రుత యోగమ్మున
విశదమ్మై నైత్రమైన పికశబ్దముహు।
ర్విశదస్మర పటు జైత్రము
విశిష్ట చైత్రము నిరతము విందంగు బ్రజకున్.

వగరున్ జేదగులేతమావి చిగురున్
   భక్షించుచున్ మాధురీ
సగుణమ్మౌనటు కూయు కోకిలతతి
   స్పర్ధాళులై వేపపూం
తంగరం బిష్టముగా భుజించి తుదకున్
   తన్మాధురీ లబ్ధిం గో
రి, గుడేక్షుమ్రముల న్నొనర్తురునవీ
   రీతిన్ జనుల్ లేహ్యమున్.

సిద్ధార్థిన్ మధుమాధవమ్ములు సురా
   ఛిద్రాత్మతం బొంద కా
విద్ధాఖిల విఘ్న శుష్కములునై
   వేలానుయాతమ్ములై
సిద్ధార్థమ్ములునై మరంద మధుభిత్
   శ్రీరూప సామ్యమ్ములై
సిద్ధుల్ గూర్చుత నెల్లలోకులకుత
   త్సేవాను మోదమ్ములై.

## ఈ పక్షంలో

### అభినందన సభ

చిత్తూరులో నూతలపాటి గంగాధరం సాహితీసత్కారాన్ని, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ బహుమానాన్ని, పొందిన సందర్భాన్ని పురస్కరించుకొని ప్రఖ్యాత కథా రచయిత్రి శ్రీమతి ఆర్. వసుంధరాదేవి గారికి, తేది 24-3-79 న, సాహిత్యభారతి, సీతంపేట గ్రంథాలయం యాజమాన్యంలో అభినందనసభ జరిగింది. శ్రీ పోతుల వీరభద్రరావుగారి అధ్యక్షతను జరిగిన యీ సభను శ్రీ నార్ని కేదారేశ్వరుడుగారు ప్రారంభించారు.

తొలుత సాహిత్యభారతి కార్యదర్శి శ్రీ కప్పగంతుల మల్లిఖార్జునరావు సభ్యులకు స్వాగతం పలికారు.

రచయిత్రిని శ్రీ నార్ని కేదారేశ్వరుడు, వారి సతీమణి శ్రీమతి నార్నికోట మహాలక్ష్మిదేవి నూతనవస్త్రాలతో సన్మానించారు.

బహుమతి పొందిన గ్రంథమైన 'గాలిరథం' కథల సంపుటిలోని 'వెంజీకటి కవ్వల', 'చెరువుగట్టున', బ్రిడ్జిక్రింద', 'పిచ్చిగీతలు', 'బదిలీ' ఇత్యాదికథల్లోని విశిష్టతను గూర్చి, సర్వశ్రీ పడాల రామకృష్ణారెడ్డి, యమ్. హెచ్. వి. సుబ్బారావు. కొండపల్లి భాస్కరరావు. మథర భానుమూర్తి శ్రీమతులు కోడూరి లీలావతీదేవి, యస్. ఎ. యస్. కుమారి గార్లు ప్రసంగించారు. కథానికలలోని, జైవిక దృక్పథాన్ని అంతర్లీనంగా కన్పించే తాత్వికధోరణిని ఉపన్యాసకులు సోదాహరణంగా వివరించారు.

విశిష్ట-అతిథిగా విచ్చేసిన శ్రీ ఆర్. ఎస్. సుదర్శనంగారు, తమ శ్రీమతిగారైన వసుంధరాదేవిగారు తమ కథలకు పాత్రలుగా జీవితంలో తటస్థపడ్డ వ్యక్తులను, సంఘటనలనే స్వీకరించారని, అయితే తమ ఆలోచనాబలంతో అత్యద్భుత శిల్పంతో కథలలో ఒక తాత్విక దృక్పథాన్ని జతచేసి శక్తిమంతంగా చెప్పేరని అన్నారు.

శ్రీమతి వసుంధరాదేవిగారు సన్మానానికి సమాధానమిస్తూ రచయితపని రాయ

డ మేననీ, దానిని అర్థంచేసుకొని వ్యాఖ్య చేసుకోవల్సింది పాఠకులనీ, నేటి వక్త లందరూ పుస్తకంలోని వివిధ దృక్పథా లని కూలంకషంగా చర్చించటం తమకు ఆనందం కలిగించిందనీ అన్నారు. వందన సమర్పణములతో సభ సమాప్తమైంది.

* * *

## వీరేశలింగ స్మారకోపన్యాసం

25-3-79 తేదీ ఆదివారం సాయం కాలం గం 4-30 లకు రాజమండ్రి వీరేశ లింగ పురమందిరమున జరిగిన సభలో ఆంధ్రవిశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులు శ్రీ ఎం. ఆర్. అప్పారావుగారు 17 వ వీరేశలింగ స్మారకోపన్యాసం గావిం చారు. సభకి శ్రీ ఆచార్య దామెర్ల వెంకటరావు అధ్యక్షత వహించిరి. పుర మందిర ధర్మకర్తృత్వసమితి యాజమా న్యాన ఈ సభ జరగినది.

అధ్యక్షోపన్యాసము సైక్లోస్టైలు తీయ బడిన పత్రాలు సదస్యులకు పంచిపెట్ట బడినవి. అందు వీరేశలింగ చరిత్రలోని ముఖ్య ఘట్టాలు కొన్ని సంక్షేపముగా తెలుపబడినవి. ఉపన్యాస పత్రాలు ముందే పంచిపెట్టబడుటచేతను, అందలి అంశాలలో అచటచటి కొన్ని మాత్రమే శ్రీ అప్పారావుగారు చూచి చదువుట చేతను, శ్రోతలకు ప్రసంగము ఉత్తేజ కరముగా తోచలేదు. అందలి విషయ ములు సామాన్యములూ చర్విత చర్వణ ములూ అయినా చెప్పిన వ్యక్తి విశేషాన్ని బట్టి వాని విలువ అధికమనుట నిర్వివా దాంశం.

* * *

## గండపెండేర సన్మానసభ



రాజమండ్రి దుర్గా విద్యాలయమండప ములో 25-3-79 ఆదివారం సాయం కాలం గం. 6-00 లకు కవి సన్మానసభ జరగినది. అనేక కావ్యములు రచించి యెన్నో బిరుదములను ధరించిన శ్రీ చేబ్రోలు చిన్మయ బ్రహ్మకవిని గండ పెండేరముతో సత్కరించుటకై ఈ సభ ఏర్పాటు చేయబడినది. సభకి ఆంధ్రవిశ్వ విద్యాలయోపాధ్యక్షులు శ్రీ ఎం. ఆర్. అప్పారావుగారు అధ్యక్షత వహించిరి. సభాధ్యక్షులుస్వయముగా కవి వామపా దముఁబట్టుకొని స్వర్ణమయమైనగండపెం డేరము దొడిగిన దృశ్యము మనోహరము. అనేక సంఘముల అభిమానుల పుష్ప మాలికాది సమర్పణము సన్మానమునకు నిండుదనము నిచ్చినది. రాజమహేంద్ర వరమున ఒక ఆంధ్రకవిని సజాతీయ రసజ్ఞ బృంద మీ విధమున సత్కరించుట అపూ ర్వ రమణీయము. 'కవితా వాచస్పతి' అను బిరుదము కవికి సమర్పింపబడినది.

కవి రచితములైన నాదబ్రహ్మ, కవి బ్రహ్మ కావ్యములు ప్రభుత్వకళాశాలాంగ్ల సంస్కృతోపన్యాసకులచే ఆవిష్కరింప బడినవి.

ఈ కార్యక్రమమున శ్రీ బుగ్గా పాపయ్య శాస్త్రిగారు కళాప్రపూర్ణ శ్రీ పసల సూర్యచంద్రరావుగారు అభినవ కృష్ణ రాయలు శ్రీ నార్ని కేదారేశ్వరుడుగారు శ్రీ గ్రంథి సుబ్రహ్మణ్యంగారు శ్రీ యస్. రామారావుగారు విద్యారణ్య శ్రీ యఱ్ఱోజు మాధవాచార్యులుగారు శ్రీ తణికెళ్ళ శ్రీరామమూర్తిగారు అవధాన సరస్వతి శ్రీ ... మహాలక్ష్మి ... శర్మగారు శ్రీ పి. శ్రీరామ మూర్తిగారు శ్రీ డా. పి. కాళీప్రసాద రావుగారు వివిధవిధులలో పాల్గొని సభని జయప్రదం గావించిరి. సహృదయుడు వినయపరుడు మాకు సజాతీయుడు (ఉపా ధ్యాయజాతి) మిత్రుడు అయిన శ్రీ చిన్మయ బ్రహ్మకవి కీ ఘనసన్మానము జరగు టత్యంతము అభినందనీయము.

ఆంధ్రసాహిత్యవ్యవసాయేతర కృషిక లనేక ప్రముఖులు కవిగారిని ప్రశంసించు టొకవిశేషము. శ్రీతన్నీరు బుల్లెయ్యగారు సభకు విచ్చేసియు సభాప్రారంభము గావింపకుండుట విశేషము. ప్రోగ్రా ములోని చిన్మయసాహిత్య సంభావనము శ్రీ ఆర్. యస్. సువర్చసముగారు గావింప వలసినది జరగలేదు. వారేకారణమునో సభకు రాలేదని తోచినది. విశ్వవిద్యా లయోపాధ్యక్షులు స్వయముగా కాలికి గండపెండేరము దొడుగుట మఱొక విశే షము. కవితావాచస్పతి బిరుదమొక నూతన ప్రయోగము. సతీసమేతముగా కవిగారిని సన్మానించి గండపెండేరము దొడగుట రాయలనాటి సత్కృతి కంటె విశిష్టము. స్త్రీ శిశుబాల వృద్ధాదు లసంఖ్యా కముగా సభకు వచ్చి ఏతదుత్సవముకనుల పండువుగా తిలకించు టత్యంత హర్షదా యకము. సభాకార్యక్రమమంతయు మనో జ్ఞము. శ్రీ యస్ రామాచారి శ్రీ పసల సూర్యచంద్రరావు గారల ప్రసంగములు విశిష్టములుగా శ్రోత లనేకుల భావన. సన్మానితుల అభిభాషణము సుమనో హరము.

-----

## —* రచయితలకు మనవి *—

సంక్షేపముగను, సౌమనస్యముతోఁ గూడినవిగాను, నుండు విమర్శనాత్మక రచనలకు స్వాగతము. గ్రంథవిమర్శకుఁ బ్రాముఖ్యము. ఔచిత్యము మీఱని అభిప్రాయ భేదములకు సముచిత గౌరవము. వాఙ్మయమునఁ జేరఁదగు వివిధాంశములపైఁ దమ రచనలు పంపి మాకుఁ జేయూఁతనీయఁ బ్రార్థన. రచనలు సరళగ్రాంథికములోఁ గాని, శిష్టవ్యావహారికములోఁ గాని యుండవచ్చును. సలక్షణములు రసవంతములు నగు పద్యరచనలకు ప్రత్యేక స్వాగతము.

సమాలోచనముపట్ల ఆదరాభిమానములతో రచయితలు సంపూర్ణ సహకార మొసగుచున్నందుకు సంతోషము. రచన లతి దీర్ఘములై 'సశేషములు' కాకుండునట్లు ప్రయత్నించుట మిక్కిలి అవసరము.

వివిధ ప్రక్రియలకు సంబంధించిన సంగ్రహ రచనల నాహ్వానించుచున్నాము. సమాలోచన గ్రంథవిమర్శకు (సమీక్షకు) ప్రత్యేక ప్రాముఖ్య మిచ్చును. సమీక్షకు పంపు గ్రంథములు రెండేసి ప్రతులు పంపవలయునని గమనింపఁ గోరిక.

- సంపాదకుడు.


అడ్రసు :—

**సంపాదకుడు, విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి,**

Retired Telugu Lecturer, V. T. J. College,

6-8-7, ఇన్నీసుపేట (త్యాగరాజ నగర్), రాజమండ్రి-1.


## —* 'సమాలోచన' ప్రకటన రేట్లు *—

| | | | |
|---|---|---|---|
| వైటిలు 4 వ పేజీ పూర్తి | పేజీ ఒకసారి ప్రకటనకు | రు. | 150. |
| ,, | ½ పేజీ ,, | రు. | 80. |
| ,, | ¼ పేజీ ,, | రు. | 50. |
| మిగిలిన పేజీలలో పూర్తి | పేజీ ,, | రు. | 100. |
| ,, | ½ పేజీ ,, | రు. | 60. |
| ,, | ¼ పేజీ ,, | రు. | 40. |

కంట్రాక్టు రేట్లకు సంపాదకుని పేర వ్రాయండి.

Editor, Printer and Publisher B. Sitharama Sastry, Printed at B. V. & Co., Press, Innispet, (Tyagaraja Nagar) Rajahmundry-1.